ఆంధ్ర కావ్యమాలా పుష్పము ౩.

# కీరసందేశము





శిరోమణి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

ఆంధ్రి కావ్యమాలా పుష్పము ౩.

# కీరసందేశము



శిరోమణి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

# తొలిపలుకు.

ఆంగ్లభాషలో Old wine in new bottles ( క్రొత్తసీసాలలో నించిన పాతమద్యము) అని లోకోక్తిగలదు. ఆనందవర్ధనాచార్యుల వారు ధ్వన్యాలోకమున

" ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాననుగుణాం స్థితిమ్ ।
ఉత్ప్రేక్ష్యోఽప్యంతరాభీష్ట రసోచితకథోన్నయః॥ "

అని కావ్యమునఁ బ్రఖ్యాతవస్తువు నందలి రసప్రతిబంధకములను దొలఁగించి రసోచితముగా దానిని మార్పవలయు ననియు.

" దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్
సర్వే నవా ఇవాభాంతి మధుమాస ఇవ ద్రుమాః.

(పురాతనములయిన కావ్యార్థములును రసపరిగ్రహము వలన వసంతమున వృక్షములవలెనే క్రొంగ్రొత్తగా భాసిల్లును) అనియు.

" నచ తేషాం ఘటతేఽవధిర్నచ తే దృశ్యంతే కదాఽపి పునరుక్తాః
యే విభ్రమాః ప్రియాణా మర్థావా సుకవివాణీనామ్."

(ప్రియురాండ్ర యొయ్యారములకు, సత్కవుల కావ్యార్థములకును, అవధియుఁ గానరాదు. అవి పునరుక్తములుగాను దోఁచవు)

అనియు నుద్ఘోషించియున్నారు. దీర్ఘముగా విచారింప నపాస్తానౌచిత్యమును రసోచితసంవిధానకము నగు ప్రఖ్యాతవస్తువు క్రొత్తసీసాలలో నించిన పాతమద్యముగాక మరేమి ? మరియుఁ దద్రసవేత్తలకు మద్య మెంత పాతగిల్లిన నంత రుచ్యమైన ట్లెంత పురాణకథయైన నంత హృద్యమగుట యతిశయోక్తికాదు. అయినను

పురాణమిత్యేవ న సాధుసర్వమ్
నచాపి కావ్యం నవమిత్యవద్యమ్
సంతః పరీక్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః.

అని కదా మహాకవి వాచోయుక్తి.

శ్రీమద్భాగవతమునందలి రుక్మిణీకల్యాణమే నా యీ కీరసందేశమునకు మూలము.

'ఆ పరితోషా ద్విదుషాం'

అని పండిత పరిషత్తు నెదుట వినమ్రభావముతోఁ గేల్మోడ్చి, నిలిచిన కవికులగురుని స్మరించుచు విమర్శకాగ్రేసరు లగు విజ్ఞుల నా యీ కూర్పునందలి గుణావగుణములను విమర్శించి తెలుపఁ బ్రణామపూర్వకముగాఁ బ్రార్థించుచున్నాను.

గోకులము,
సికిందాబాద్.

గ్రంథకర్త.

# కీరసందేశము



౧

గీ. యదుకులంబున భూభార మపనయింప
నా పితామహుఁగన్న నారాయణుండు
అవతరించి దయామతి ద్వారవతిని
నుండె భక్తుల పిలుపులఁ 'కో!' యటంచు. ౧

చ. సనకసనందనాది మునిసంతతి కొల్వఁగవచ్చుచుండు బ
త్తిని; మనవుల్ పొనర్ప నరుదెంతురు దిక్పతు; లూడిగంబు సే
యను జనుదెంచు వేల్పునివహంబు; నుతింపఁగ వచ్చి పోవుఁ జా
రణతతి; విష్ణుకృష్ణుల పరస్పర భేదము లేమిఁ దెల్పుచున్. ౨

క. దాంతుఁడు శాంతుఁడు నని వే
దాంతులు రసికావతంసుఁడని యా గోపీ
కాంతలు ప్రియపడి తమ తమ
స్వాంతముల భజించుచుండ్రు సంతతము హరిన్. ౩

క. తమ ప్రాణమిత్రుఁడనుచుం
దమకందువచుట్ట మనుచుఁ దమవాఁడనుచుం
బ్రమదపడఁ గొంగుబంగా
రముగా వర్తిల్లు శౌరి ప్రతివారి కటన్. ౪

క. తొమ్మిది నిధులును, గలుముల
కొమ్మయు సేవింపఁ దన్ను గోవిందుఁడు, లో
కమ్ములు పదునాల్గు స్వకీ
యమ్ములుగా విలిచి మనుచు చట వసియించున్. ౫

౨

శా. తమ్ముం దాఁకుము; తమ్ముఁ దాఁకు, మనుచున్ ధన్యత్వ మాశించి వృ
క్షమ్ముల్ కుంజములున్ లతావళులు మార్గమ్మున్ నిరోధింపఁగా
సమ్మానించుచు వాని నన్నిఁటిని సంస్పర్శంబులన్ జూడ్కులన్,
నెమ్మిం బొందుచుఁ గీరముఖ్యరుతులన్, గృష్ణుండు పూఁదోఁటలోన్

క. విహరించుచు నొకపరి, నిజ
గృహపుష్పోద్యాన లక్ష్మికిని గద్దె యనన్
స్పృహణీయాకృతిఁ దగు నొక
సహకారము నీడ నాఁగె శశికాంతతటిన్. ౭

క. కుడికన్నును గుడిబుజమును
గడు నదరెను; జాతఫల మొకఁడు కేల్దమ్మిం
బడె మింటినుండి; యక్కడ
పడ ముందొక వింతచిలుక వ్రాలెను హరికిన్. ౮

గీ. వ్రాలి తెక్కార్చి దక్షిణపాద మెత్తి
యమృతమున కప్పు లోనగు స్వాద్యత్వ మొలుక
జయజయారావ మొనరించి ప్రియ మొనర్ప
దగ్గఱికిలాగి దువ్వి మాధవుఁడు పలికె. ౯

గీ. ఇంబడరు శక్రచాప ఖండంబువోలెఁ
దైలబిందువు వడినట్టి తరఁగవోలె
రంగురంగుల పువ్వుల రాశివోలెఁ
జిత్రవర్ణాంబరముఁదాల్చు చెలువవోలె
నయనపర్వంబు సేయు చున్నావు నాకు
స్వాగతము నీకు నో పంచవన్నెచిలుక!
అమరలోకంబునందు నిత్యమువసించు
చుండి వాహ్యాళికోసమై యుర్వికరుగు

డెంచు కిన్నరకన్యవో! యంచుఁదలఁతు
నమ్మఁగాఁజాలఁ బక్షిమాత్రమ్మ వగుట;
నీదు చక్కఁదనంబును నిశ్చయముగ
నపహరించెనో! యేస్వల్పమైన రతియుఁ
గానిచోనట్టి యందంబు గలుగునెట్లు?
నిన్ను యాచించి నీ రామణీయకంబు
నెరువు గొనిపోవు చుందురో సురతరుణులు
మునుల తపములఁ జెఱచెడు పనులకొఱకుఁ
గాక మోహింపఁగాఁ జేయఁ గలుగునెట్లు?
పండ్లరసమును ద్రాగుటఁ బట్టి యేమొ?
అంత మధురంబుగా మాటలాడఁగలవు;
అంత సుందరమూర్తివి యగుటనేమొ!
అంత ముద్దులు గులుక మాటాడఁ గలవు;
ఆననమె కాదు; నీదు ప్రత్యంగ మరయ
నమృతము స్రవింపఁగా మాట లాడుచుండు. ౧౦

క. శ్రీయుత! మీ దేదేశము?
నీయట్టి మనోజ్ఞమూర్తి నింబెంచిన దా
హా! యే యువతీమణియో?
యీ యాగమనమున కెద్ది హేతువొ? చెప్పుమా! ౧౧

మ. అని పృచ్ఛింపఁగఁ జిల్కవల్కెను "మహాత్మా! లోక వృత్తాంత మె
ల్ల ననుక్తంబుగ నీవెఱుంగుదు త్రికాలజ్ఞుండవై యుంట; నై
నను నన్నుం జరితార్థుఁ జేయుటకుఁ బ్రశ్నం జేతువం చెన్నుదున్
విను సందేశము ముందుముందుగఁ బయిన్ విన్పించెదన్ మత్కథన్.

## 3

క. వినియే యుందువు రుక్మిణి
యను కుండినరాజవంశమందున నుదయిం
చిన రత్నము నారత్నం
బును జేయుము నీదు కంఠభూషణము హరీ! ౧౩

క. పుట్టియుఁ బుట్టక మునుపే
పుట్టెను నీపైనిఁ బ్రేమ పురుషోత్తమ! యా
పట్టికి; దీనికిఁ గారణ
మెట్టో! పామరులమైన యే మెఱుఁగుదుమే? ౧౪

గీ. పండఁగాఁ బెట్టి మెత్తని పసిఁడితొట్లఁ
దల్లి నీమీఁది మధురగీతములఁ బాడ
నేడ్పుసాలించి వినుచు వహించుచుండె
సమ్మదము రుక్మిణీకన్య శైశవమున. ౧౫

గీ. పాటఁబాడంగ బాల యేడ్వంగమానుఁ;
బూను నేడ్వంగ నాపాట మానునంతఁ
బాటకై యేడ్చునేమొ యెవ్వాఁడెఱుంగుఁ?
బ్రాగ్జనుర్బాంధవంబో! యెవ్వండెఱుంగు? ౧౬

క. నీ లీలాగీతంబులు
బాలారిష్టాది సర్వబాధాచయ ని
ర్మూలకమణి మంత్రౌషధ
జాలంబయ్యెను విదర్భజాతామణికిన్. ౧౭

గీ. దినము బుడిబుడి పారాడుకొను చొకప్డు
తప్పటడుగులు వేయు చొకప్పు డేగి
యాత్మపూజా గృహస్థితుండైన విష్ణు
నెవరో చెప్పిన చందాన నెరగు బాల. ౧౮

ఆ. వె. చిఱుతకేలు లెత్తి జేజెవెట్టును; గీచు
గొంతుకెత్తిపాడుఁ గూనపాటఁ;
బైఁడిపళ్ళెరమునఁ బట్టు నివ్వాళిక
నా రమేశు విగ్రహంబు నెదుట. ౧౯

ఆ. వె. అత్త! తాత! యనుచు నాయాయిమాటలఁ
గఱపఁదల్లి వానిఁ దిరిగి యనక
కృష్ణ! కృష్ణ! యనుచు శ్రీ రుక్మిణీకన్య
పలుకు నక్కజంబు వడ జనంబు. ౨౦

గీ. ఎవనిఁబెండ్లాడె? దని యెవ్వ రేని నడుగ
శ్రీహరి నటంచుఁ బ్రత్యుత్తరించు బాల
స్వర్ణ విగ్రహమును దెచ్చి ప్రక్కనిలిపి
సేసఁబ్రాల్వోయు నవ్వుచు శిరసువాంచి. ౨౧

గీ. పసుపుఁ బారాణిఁ దీఱిచి పాదములకు
నుదుటఁ గుంకుమముం బెట్టి సుదతి పంచి
పండ్ల, మ్రొక్కంగ, దీవింతురు "వలచిన పతిఁ
బెండ్లియై వర్ధిలుమ" యంచు వృద్ధసతులు. ౨౨

క. లీలానరుండ వగునీ
బాలక్రీడలను వినుచుఁ బార్వణశశికై
బాలచకోరిక పోలిక
బాలిక యువ్విళ్లుగొనియె భావమునఁ గడున్. ౨౩

క. తన భుజియించు ఫలాదులఁ
దనతాలుచు కమ్మపూలదండలఁ జెండుల్
తనపూయు చందనాదుల
మును మనమున నీకొసంగి పూఁబోఁడిగొనున్. ౨౪

## కీ ర సం దే శ ము

క. జలజాక్ష! నీదురూపముఁ
జెలికత్తె యొకర్తు తెల్ప శ్రీరుక్మిణి కాఁ
గిలిగొను, ముద్దాడును, నగుఁ
గొలుచును విందులను గుడుపుఁ గూరిమి సూపున్. ౨౫

క. ఈ విధముగ నిన్నా చెలి
గోవింద! ప్రతిష్ఠసేసి గాఢముగ మనో
దేవాలయమున నిచ్చలు
సేవించుఁ బరిపూర్ణ రక్తిఁ జిన్నతికమునన్. ౨౬

క. జననాంతర సౌహృద వా
సన లుద్బుద్ధంబు లగుట జంతువు ప్రేమిం
చును లాఁతిఁ; గాక యారు
క్మిణి యీ ప్రాయమున నిన్నుఁ గృష్ణ! వలచునే! ౨౭

క. అవయవములతో నీపయిఁ
దవులంబును, దవులుతోడఁ దనువిభ్రమముల్
నవవిభ్రమములతో గుణ
నివహము లేకెత్తె రుక్మిణికి నానాఁటన్. ౨౮

క. తొడిమం డాఁగిన పుష్పము
వడువున నొత్తించి శైశవప్రాయంబున్
గడలకు, నా కన్యామణి
యొడ లొగి వికసించె లోచనోత్సవ మగుచున్. ౨౯

గీ. రూపరేఖావిలాసముల్ ప్రోజ్జ్వలముగ
నించువిలుకాఁడు నీకుఁ జిత్రించుచుండ
రతి తతోధిక రూపవిభ్రమ విభూతి
నించె గన్యను బతిఁ బంతగించినట్లు. ౩౦

చ. తన పితృమందిరాగతబుధప్రకరం బొనరించు నీదు వ
ర్ణన విని నిన్నుఁ జిత్తరువువ్రాయును; బ్రక్కనె తన్నువ్రాసి చూ
చును బలుమాఱు, నల్దెసలు చూచుచుఁ జూతురొ! లాఁతులంచుఁ జుం
బన మొనరించు; నొత్తుకొనుబాల నిజం బని చిత్రమక్కునన్. ౩౧

క. చెలులకుఁ బాఠము సెప్పును,
బలికించును వీణపై ని; వంశీలత నా
లలనామణి వాయించును;
జలజాక్ష! త్వదీయ వర్ణసముదాయంబుల్. ౩౨

చ. కిలకిలనవ్వి "శౌరి గిలిగింతలు పెట్టె" నటంచు బేల తాఁ
బలుకుఁ; దటాలునం బరుగువాఱియుఁ "బైపడ వెంబడించె నా
చెలువుఁ" డనున్ వనింజనుచుఁ జిత్తరు బొమ్మయనంగ దారిలో
నిలఁబడి "యాఁచెఁ గృష్ణుఁ" డను నెత్తులు డగ్గఱి ప్రశ్నఁ గ్రుచ్చినన్ ౩౩

చ. వెలువడు నీదునామములె వేరిని నోటను బిల్వఁబోయినన్;
గలము లిఖించు నిన్నె స్వమనంబున నెయ్యది వ్రాయఁబోయినన్;
నలుఁగడలందు నీవయి కనంబడు దెయ్యది కాంచఁబోయినన్;
వెలఁదికి వేణునాదమె చెవింబడు నెయ్యది యాలకించినన్. ౩౪

గీ. బయలఁగాంచుచు నీదు రూపమును గృష్ణ!
వకుళమాలను బాల యర్పణ మొనర్ప
నదియు జాఱి నిరాధార మగుటఁ బుడమి
నెద విచారించును బరిగ్రహింపనట్లు. ౩౫

క. తను మొఱఁగి యన్యయువతుల
వెనువెంటం దిరుగుదంట; బెట్టిదమగు కి
న్కను బూనునంట రుక్మిణి;
వనజాక్షా! వ్రాలుదంట పదములఁగలలన్. ౩౬

కీ ర సం దే శ ము

క. నిన్ను ముద్దాడుచున్నట్లు నిశ్చయించి
నన్ను చువ్వాచుఁ దగఁ జుంబనం బొనర్చు
నిన్నుఁ గౌఁగిలి గొనునట్లు నిశ్చయించి
బాల కౌఁగిలి గొను రిత్తబయలు ఱేల. ౩౮

మ. పరగన్ నాదు స్వయంవరంబునకు నాహ్వానింప మా తండ్రి ప
ల్వురు విచ్చేతురు ఱేండ్లు; వారియెదుటన్ ఫుల్లాంబుజాతేక్షణున్
వరియింతున్ విరిదండ వానిమెడలో వైతున్ ననుం బెండ్లి సే
తు రఁటం చవ్విభులూఱు రుక్మిణి యెదం దోరంపు మోహంబునన్.

క. అతివతలబంతి వలపున
శతాంశమును దెలుపనైతిఁ జాలమి; సర్వ
జ్ఞతవడసిన నీవెఱుఁగవె?
ఋతమో? అనృతమొ? వచించు నీ నాపలుకుల్. ౩౯

గీ. బాల చక్కని చుక్క, వజ్రాలబరణి,
రతనపుం బొమ్మ, వలరాజు రాజ్యలక్ష్మి,
యామె జగదేకసుందరి యన్నపలుకు
అగు స్వభావోక్తి; కాదుసూ! అతిశయోక్తి. ౪౦

క. "ఎచ్చట రూపశ్రీగల
దచ్చట గుణములు వసించు" నండ్రి భువినిన్
మచ్చునకుఁ గలరె యట్టిరు?
నిచ్చల మీ పలుకు రుక్మిణీసతి దక్కన్. ౪౧

గీ. ఆ లలన గాత్ర మొక్కరత్నాలరాశి
అన్యులకు లోభనీయంబ యగునుగాని
నిక్క మద్దాని వెలగట్ట నీకుఁదక్క
దానిఁ గొన నీకుఁ దక్క సాధ్యంబె పెఱకు? ౪౨

౪

క. శిశుపాలుం డా సుందరి
పరిశస్యలావణ్యమును భవత్ప్రణయంబుం
దిశలం బ్రాఁకంగా విని
విశేషముగ నీసుగొనెఁ ద్రివిక్రమ ! నీపై. ౪౩

క. నరియింపఁగ నాత్మార్థము
తరుణిని నాతఁడు పురోహితజనం బనుపం
బరిగణియింపక జనకుఁడు
తిరస్కృతి నొనర్చెఁ దత్తదీయార్థనముం. ౪౪

క. ప్రాచికి వహించు నదినిఁ బ్ర
తీచికిఁ జేబలిమి ద్రిప్పు తెఱఁగునను మదిం
నీచుఁడు చైద్యుఁడు తనదెస
కా చంద్రాననను ద్రిప్ప నాకాంక్షించెం. ౪౫

ఆ. వె. పువ్వుఁబోడిపైని మోహంబు, నీపై న
సూయ యీ పిశాచికాయుగంబు
చైద్యుఁ బట్టియుంటఁ జలపట్టి దర్పించి
యతఁడు తలఁపుగొనియె నయ్య! యిట్లు. ౪౬

క. హరియించు నాలసించిన
హరి మాయలమాఱియగుట నా సతి నెపుడో !
హరియింతును నేనయి బం
ధుర మాశించిన సుమంబు మానవుఁడు బలెం. ౪౭

చ. ఇదె చని కుండినంబునకు నీ చతురంగ బలంబుతోడఁ గ్రి
క్కిఁదల ధరిత్రి భీష్మకుఁ డకాండలయం బని బెగ్గడిల్లఁగా
వదలక వారిజాక్షిఁ గొనివత్తును గృష్ణుఁ బరాభవింతుఁ; జం
పుదు నెదురైన భీష్మక చమూతతిఁ గాలను నేల రాయుచుం. ౪౮

గీ. శృంగభంగంబొనర్తు శౌరికిని; యాద
వునకు బొమ్మను గట్టింతుఁ బురమునడుమఁ
ఇదిగో! హరియాటఁ గట్టింతు నీదినమున
ననుచు నా దుర్మదాంధుఁడు కనిసె బిట్టు. ౪౯

క. పెఱకోలఁడియు తన కోలఁదియు
తరతమత నెఱుంగనట్టి దర్పితుఁ డల చి
చ్చుఱుకు శలభంబు తెఱఁగున
స్వరూపనాశంబుఁ గొనఁడె? సత్వరము హరీ! ౫౦

చ. జ్వలనము చండమారుతము సాయముగొన్నవిధంబునన్ మహా
బలులగు మాగధాదులయు బాసటఁగైకొని వాఁడు వీటి న
ల్వలఁకుల ముట్టడించె బహుభంగుల నొత్తిడిసేసె తేనికిన్
గొలఁదులులేని సంద్రమునకున్ గుఱివచ్చెడి పెద్ద దండుతోన్. ౫౧

౫

క. ఆ కల్లాడదు పురమున;
రాకలుఁ బోకలు నడంగెఁ బ్రాణము లఱచేఁ
గైకొని యుండిరి పౌరులు;
తేకువ సెడి భీష్మకుండు దిగులొందె మదిన్. ౫౨

క. నలుఁగడలను నిప్పంటిన
యిలువలె, నలుదెసలఁ బొంగు నేళుల నడుమం
గల దీవివోలె భీష్మకుఁ
డలజడివడియెం బ్రతికిక్రియా రహితుండై. ౫౩

క. తమ మీఁదఁబడ్డ యాద
య్యము కోరికి నెఱేఁగి రుక్మి యా బెడదఁ కుపా
యముఁ గనక దాఁటఁ జెల్లెలి
సమర్పణముసేసి బ్రదుక సంకల్పించెన్. ౫౪

క. రతనంబు నింగలమునకు
జతగూర్పు, మరాళిఁ గాకి జతఁగూర్ప నౌనో?
హతవిధి సృష్టి రహస్యము
సుతరామును రాదు మాదృశుల కెఱుఁగంగన్. ౫౫

క. పిడుగడచిన వడువున నా
పడఁతుక మూర్ఛిల్లి పెద్ద పలవించుచు నా
నుడి విని గడియ నుండియుఁ
దొడుగదుఁ బూయదును గట్టదును వింటె? హరీ! ౫౬

క. తన క్రీడారామమునకుఁ
జని లతికామంటపమున శశికాంతశిలా
సనమున రాలిన పుష్పం
బన నంగము ముడిచి మ్లానయై కూర్చుండెన్. ౫౭

చ. కడుఁగడు బాష్పముల్ విడుచుఁ గంటికి మంటికి నేకధారగా;
విడుచును వేఁడి యూర్పులను బెద్దగఁ, జిత్తము మండు చిచ్చునం
బడినదివోలెఁ, గ్రూరమగు బాధవడున్; హసియించు; నేడ్చు; నీ
ఱేఁడియన మాటఁ దొట్రువడుఁ, ద్రేలును; మాచెలి యేమిచెప్పుదున్

క. ఏమని ధైర్యముఁ జెప్పుదు?
మేమని యౌదార్యవలయు? నేమాడిన యా
యామాటలు గ్రహియింపదె?
భామారత్న ముపచారవాక్యము లనుచున్. ౫౯

క. ఆఁకట్టి నలుగవంకుల
వే కన్నుల నతఁడు నగరి వెలి కెవ్వనిఁ బో
నీకుంటఁ దనయుదంతము
నీ కనుపఁగరామిఁ బొగులు నెలఁతుక మిగులన్. ౬౦

కీరసందేశము

మ. తనతోఁ పాటుగ నశ్రుల్ విడుచు నా దన్వంగి వీక్షించి గో
రను గన్నీటిని మీటుచుం బ్రియసఖీ! ప్రాణప్రియుండైన కృ
ష్ణునకున్ నా గతిఁ దెల్పు మానిసి యొకండున్ లేఁడిటన్ నీవు ద
క్క, నన్ను మున్చిన్ దేల్చినన్ గతివి నిక్కం బీవ సుమ్మీ! యిఁకన్.

క. నిను శంకింపద పట్టద
మన కోటను గాచు శత్రుమండల మనిలం
బునువలె; నిట నున్నట్లుగ
జనిరమ్మా! నిన్నుఁ గొలుతు జన్మశతంబుల్. ౬౨

క. అని నన్నుఁ గాళ్ళ గడ్డం
బునుగొని బతిమాలె రాజపుత్రిక; నా స్వా
మిని ఋణముఁదీర్చు భాగ్యముఁ
గనితిని; నీ దర్శనంబుఁ గంటిని సుకృతిన్. ౬౩

క. చెఱవట్టుఁ జైద్యుఁడు ధరా
వరుపట్టి; బలాత్కరింప వచ్చును దామో
దర! శేషా! మాఘా!; వినుమా
సరోజముఖి పంపియున్న సందేశంబున్. ౬౪

క. "పరమేశ్వర! సూత్రాత్మతఁ
జరియింతువుగద సమస్త జంతువులందున్
ఎఱుఁగవె? నాయెదఁ గాలుచు
పరితాపపు టగ్గికాఁక పరిమాణంబున్. ౬౫

క. అలచైద్యునకున్ నన్నిడి
బలిగా మాయన్న, దయకుఁ బాత్రుఁడుగాఁగన్
దలఁచె; భవత్పద దాసిని
బలిహార! నను నీటముంతో? పాలను ముంతో? ౬౬

క. జనియించితి నీకోసమె!
అనన్యమతి ముడుపుగట్టి యౌవనము సమ
ర్పణ సేయనుంటి; మదుపా
యనమును గొని నన్ననుగ్రహము సేయు హరీ! ౧౭

క. హతదైవము నీకంఠో
చితమగు తోమాలియను గసింగొనిన గతిఁ
మతిఁబూనెను గై సేయఁగ
నతిసేచపు శునకకంఠ మాలింపు హరీ! ౧౮

గీ. బుద్ధివచ్చిన దాదిఁద్రిశుద్ధిగలిగి
యెన్నివ్రతములు తపములెన్నెన్ని దాన
ములు నినుంగోరి ప్రియునిగాఁ బుణ్యపురుష!
ఆచరించితినో! యంతరాత్మ యెఱుఁగు. ౧౯

గీ. వేసె నాభాగ్యవల్లరి వెఱ్ఱితలలు;
వెన్ను వేసెను నాదు జీవితపుఁజెఱకు;
కుళ్ళుచున్నది నాప్రేమ రుచిరఫలము;
వ్రతఫలం బిట్లు విపరీతగతులఁ దాల్చె. ౨౦

క. నిను వలచు భక్తురాలను
మనోవచఃకాయములను మాధవ! విసముం
దినిపింతువా? కా కమృతముఁ
దినిపింతువా; నిన్నె నమ్మితిని సత్యముగన్. ౨౧

క. శ్రుతిఁగూర్తును నీ పాటకు
సతతంబు నొనర్తుఁ బాదసంవాహనమున్
ధృతినిత్తును గై దండలఁ;
బ్రతిదినమున నీకు రేయుఁబవళ్ళులను హరీ! ౨౨

క. ఏ పలుకులు పలికితినో ?
ఏ పగిదిఁ జరించినానో ? యెది తలఁచితినో ?
నీ పయి మదిఁగొని సర్వ
వ్యాపివి సాక్షివి వచింప వ్యర్థముగాదే ? 23

క. కొండను వేలిను దాల్పవె ?
కొండికవయి; యిదిగో ! విఱుచుకొని పడుచుండెం
గొండయొకటి నాపయి నీ
యండను శరణందితిని దయామతిఁగనవే ! " 24

క. ఆ యువతియిట్లు సూత్రి
ప్రాయముగ వచించె ముగ్ధభావంబున నా
రాయణ ! దీనికి భాష్య
ప్రాయమ నా నోడివియున్న ప్రాక్కథయెల్లన్. 25

క. అనలోద్బంధన జల మ
జ్జనముల మే న్వాయు సాహసముఁ బూను నిఁకన్
వనితామణి; తడసితివే
విను గతజల సేతుబంధ విధమగుఁ బిదపన్. 26

క. సమయంబుగాద యిట మీా
నమేషగణనకు జనార్దనా ! 'ఆలస్యా
దమృతం విష'మ్మటంచును
సుమతులు మిముబోంట్లు పలుకుసూక్తిఁ దలఁపుమీా ! 27

క. తెలిపితి నామూలాగ్రము
చెలి కత; యిది నీదు దివ్యచిత్తమునకుఁ దే
వలె; నినుబోంట్లకు వలయునె
పులుఁగులు కర్తవ్యములను బోధింపంగన్ ? 28

౬.

ఆ. వె. అని వచించి కీర మారూపుఁ ద్యజియించి
మెఱుపు మెఱసినట్లు మెఱసి యెదుట
వేల్పుఁ బూవుఁబోఁడి వెత మొంది నిలుచుండి
యబ్రిమొందుచున్న హరికిఁ బలికె. ౨౯

క. తొలి సిరిచెలిక త్తెను నా
కొలుకులుఁ బలుకులును జిలుకకును బలె నున్నన్
'జిలుక' యటంచును బేరిడి
పిలిచెను నా మొదలిపేరు విద్యుల్లత సూ! ౩౦

క. చాపలమున ముచ్చిలితిని
నా పొలఁతుక చిత్రవర్ణమగు నంబరమున్
శాపించె ననుఁ దదంబర
రూపంబు వహించి చిలుక రూపము నొందన్. ౩౧

క. "దాసుల దోసము దండము
తోసరి ననుఁగావు" మనుచుఁ దోడ్తో వేఁడన్
రోసంబు వదలి వైద
ర్భీసందేశమునఁ దన్నివృత్తినిఁ దెలిపెన్. ౩౨

శా. అంతన్ వన్నెలచిల్కనై యల విదర్భాధీశు నంతఃపురీ
కాంతారంబున సంచరింపఁగ ధరాకాంతుండు పట్టించి న
న్నెంతేఁ గూర్చుచుఁ బెంచె; నీగడియకై యాక్షించుచున్ రుక్మిణీ
పాంతంబందు వసించి నీకృపను శాపాంతంబు నేఁడొందితిన్. ౩౩

క. తినిపించె నాకు స్వయముగ
వనితామణి మధురమధుర ఫలజాలంబుం
దన చెక్కిలి కొత్తుచుఁ జుం
బన మొనరించెడిని నన్ను బహువారంబుల్. ౩౪

క. నన్ను బహిఃప్రాణంబుగ
మన్నించెను; గన్నతల్లి మాదిరిఁ బెనిచెన్ ;
బెన్నిధి గఁదోఁచె రుక్మిణి;
మున్నిటి సిరిగొల్పుఫలము పోవునె వితమై? ౮౫

క. సెలవిమ్మా ! పోయివత్తును
నళినాక్ష ! కృపార్ద్రవీక్షణమ్ముల నీ వా
చెలువను మనుపు మవశ్యము
తెలుపుము నావార్త నాసతికి సంకథలన్. ౮౬

క. అని విన్నవించి తన కథఁ
బునఃపరిణామం బొనర్చి పూఁబోఁడి చనెన్
అనిమిషవధూశిరోమణి
జనార్దనుని రమణిపాదసంసేవనకై. ౮౭

౭

చ. కనులకుఁగట్టినట్లుగనె కన్పడుచున్నది నా యెడందకున్
వనితయవస్థ; యాసతి మనోహరరూపము నాభిజాత్యమున్
ఘనగుణశీలముల్, వితరణంబు, సదాచరణంబు మత్పరా
యణతయు లెస్స నారదమహర్షి వచింపఁగ వింటిఁ దొల్లిటన్. ౮౮

క. తెలిపెను దూ చా తప్పక
చిలుకయుఁ దదవస్థ; నేను జెప్పనుగానీ
వెలికించుమించు దగు నా
లలనకునున్ నాకు వ్యాధిలక్షణ మొకఁడై. ౮౯

క. అనుకొని "శుభస్య శీఘ్ర"
మ్మని హరి జవనాశ్వయుక్తమగు కనకస్యం
దనమున సచాపుఁడై కుం
డినమునకుం జనియె రుక్మిణిని గ్రహియింపన్. ౯౦

క. బలవంతముపై సోదరి
నల చైద్యున కొసఁగి పరిణయంబొనరింపం
దలఁచి యట రుక్మియుండఁగఁ
బిలువని పేరంటమునకు వెన్నుఁడు వచ్చెన్. ౯౧

గీ. ఈ దురాత్ముండు పీఁటలమీఁది పెండ్లిఁ
జెఱుప నేతెంచె నని పెద్ద సేనఁదీర్చి
చైద్య మాగధ ముఖ్యులు శౌరిఁజెనక
నొక్కఁడయ్యును హరి వారి ధిక్కరించి. ౯౨

క. అందఱికి నన్నిరూపము
లం దాలిచి రాచి నల్లులంబలె సేనా
బృందమును గ్రుక్కి పేనుల
చందంబునఁ బీన్గుఁబెంట సలిపెను గడిమిన్. ౯౩

క. సంతర్పణం బొనర్చె ము
రాంతకుఁడు పిశాచజంబుకాదుల, సేనా
సంతతిమాంసాస్థులను, ని
తాంతముఁ బ్రవహించు శోణితమునను నాఁటన్. ౯౪

క. ఆకసమున గ్రద్దలు చ
క్రాకృతిఁ జరియింపఁ దొడఁగె; నాడెను నేలన్
మూఁకలయి కబంధంబులు
నా కలహాశుఁడు నటించె నార్చుచుఁ గుంచెన్. ౯౫

క. పిడుగునకును గోడః గడ్డమె ?
బెడిదంబగు గుడుసుఁ దాల్చు పెద్దకు శిశుపా
లుఁడు సేసెడి ప్రతిరోధము
కడిఁదియొ! వాఁడెల్లొ పఱచి గండము గడచెన్. ౯౬

గీ. "శరశతంబులు గురిసినం జావఁబోఁడు
మానవుఁ డకాలమందుఁ; దా మరణమొందుఁ
బ్రాప్తకాలుండు దర్భాంకురం బొకండు
దాఁకు మాత్రన" యనుచుఁ బెద్దలువచింతురు. ౯౭

గీ. నమలఁగారాని నారికేళముగనైన
సుదతి శిశుపాలుఁ డాశలు వదలి పాఱె;
గిరిసరణి పైనిఁబడి మంచుకరణి విఱిసెఁ
దన బెడఁదయంచుఁ దరుణి పెందమున నూర్చె. ౯౮

క. ఏపిల్లిమొగము సూచెనో ?
శేపకర్ణ లేచి యతఁ; డదృష్టము మాయన్
గోపాలమాళి రుక్మిణి
తోపాటుగ విజయలక్ష్మి దొంగిలియించెఁ. ౯౯

ఆ. వె. వెక్కిరింపఁబోయి వెలికిలఁబడ్డట్లు
విసరఁబోయి కాలు విఱిగినట్లు
హరి పరాభవింప నాచైద్యుఁడు దలంచి
నవ్వుఁబాటు వొందె నలువురందు. ౧౦౦

౮

క. కనుమూసి తెఱచు వేళకుఁ
జనుదెమ్మని పంపియుంటెఁ "జనెఁగద! నారా
యణుఁ" డని తడసెనో ? మరి చి
క్కెనో ? వచ్చుచు శాత్రవులకుఁ గీరంబకటా ! ౧౦౧

ఆ. వె. అనుచుఁ జిలుకరామి నా హరివచ్చిన
నా వెలంది తాళ కాత్మఁగుందు
బిక్కమొగము వేసి వీక్షించు నల్దిక్కుఁ
బెంచియున్న వలపు పెద్దవలపు. ౧౦౨

౬

క. తలవని తలంపుగాఁ దమ
యిలుసొచ్చియు బలిని గోరు నీ దయ్యంబుం
బొలిమేరదాఁకఁ దఱిమిన
బలిహరునకు భీష్మకుండు స్వాగతమొసఁగెన్. ౧౦౩

గీ. "చైద్యు ధాటి కోర్వఁజాలని పందనై
మనసుగాని యిట్టి మను మొనర్చి
చెల్లెలికిని నీకు సేగి సేయఁదలంచు
పాపి" ననుచు రుక్మి వచ్చి మ్రొక్కె. ౧౦౪

ఉ. పీఁటలమీఁది పెండిలికి విఘ్న మొనర్చిన పాతకంబు పోఁ
బాటలగంధి రుక్మిణిని వారిజనేత్రుఁడు కూరుచుండి యా
పీఁటలఁ బెండ్లియాడెఁ గురిపింపఁగ వేల్పులు పూలవానలన్
బాటలుపాడఁ గిన్నరు లొయారముగా దివినాడ నచ్చరల్. ౧౦౫

క. జననం బాదిగ వలచియు
మనమునఁ దపియించు చున్న మానినికి జనా
ర్దనుఁడొనరింపఁడె స్వాత్మా
ర్పణమును సాక్షాత్కరించి భక్తావనుఁడై? ౧౦౬

క. తదుపరి హరి పెండ్లాడిన
పదారువేల యువతులకును బట్టమహిషియై
పొదలెడు భాగ్యము నోచిన
విదర్భకన్యకకు సాటి పృథివినిఁ గలరే? ౧౦౭

క. శ్రేయములకు విఘ్నంబులు
ప్రాయికముగ సంభవించు; భగవత్కృపచే
వాయువుచే ఘనతతివలెఁ
బాయును దవ్వులకు; శుభంబులు పొదలున్. ౧౦౮

క. చిలుకల కొలికికిఁ గృష్ణుఁడు
చిలుకకు శాపాంతమగుటఁ జెప్పియుఁ బోకం
దెలిపియుఁ దద్వ్యథ మానిచి
సలలిత కేళీవిలాస సంతతిఁ దేల్చెన్. ౧౦౯

క. చిలుకయు గోర్వంకయువలెఁ
బొలఁతియుఁ బురుషోత్తముండు పొనలం, బూఁదోఁ
టలఁ జప్పరంబులను, జె
క్కిలి చెక్కిలి రాయఁ దిరిగి క్రీడించిరొగిన్. ౧౧౦

సమాప్తము.



# భూమిక

కల్హణుఁడు రాజతరంగిణిని (కాశ్మీర రాజవంశచరిత్రము) వలె ఫిర్దౌసీ అను పారసీక కవి 'షాహ్‌నామా' (పారసీక రాజవంశచరిత్రము) అను నుద్గ్రంథమును విరచించెను. దానినుండి Mathew Arnold అను నాంగ్లకవి మహావీరులైన సొహ్రాబు రుస్తుము లను పితాపుత్రుల ద్వంద్వయుద్ధమును దీసి ప్రత్యేక మొక కావ్యముగా వ్రాసెను. ఇది కట్టుకతగాక చరిత్ర ప్రసిద్ధవిషయము.

చరిత్రమును గావ్యముగా రచించునపు డందలి యంశములు (Facts) రసానుకూలముగాఁ బ్రధానకథకు విరోధము రానివిధమున మార్పవలయును. మార్పకున్నచో నది కావ్యమేకాదు. చరిత్రమే యగును. చరిత్రములలోఁ బెక్కంశములు గార్యకారణ భావశూన్య ములై యుండును. కావ్యమునం దా యంశములను గార్యకారణ భావా శ్రయములనుగా మార్పవలయును. చరిత్రమునకును గావ్యమునకును గల భేదము Aristotle అను గ్రీకు విమర్శకుఁ డిట్లు నిర్వచించెను.

"Poetry has a rigorous connection of events (i.e.), cause and event linked together in the probable consequence. Whereas the historical events are a record of actual facts arranged in order of time but without causual connection."

"History deals with facts, Poetry transforms facts to truths."

మరియుఁ గావ్య ముదాత్తము, రస మయముగా నుండవలయును గాన రసప్రతిబంధకము లగు చరిత్రాంశములను మార్పవలయును.

ఆ దృష్టితోడనే నేను Mathew Arnold కవి వ్రాసిన సొహ్రాబు రుస్తుముల యితివృత్తమునం దలఁతిమార్పులను గావించితిని. ఆర్నాల్డుకవియు 'షాహ్‌నామా' గ్రంథమందలి కథను గొలదిఁగా మార్చినాఁడు. ముఖ్యముగా షాహ్‌నామాకారుఁడు రుస్తుమును మహా వీరునిఁగా బ్రదర్శింపఁగా ఆర్నాల్డు సొహ్రాబునే మహావీరునిఁగా జేసెను. మాతృకలోని మూనాళ్ల యుద్ధము నేకదిన యుద్ధముగా మార్చెను. ఇట్టిమార్పులు ప్రధానకథకు బాధకములు గాక రస సాధ కములుగానే పరిగణింపఁబడును.

ఆర్నాల్డు మహాకవి యనియు, విమర్శకుఁడనియుఁ బెద్ద ప్రసిద్ధిని వహించెను. 'ఉపమా కాళిదాసస్య' అని సంస్కృతవాఙ్మయమున నుపమా లంకారమును గాళిదాసువలెనే పాశ్చాత్య వాఙ్మయమున నుపమాలం కారమును హోమరు, ఆర్నాల్డు కవులు గుత్తకుఁ గొనిరి. కానీ యీ

యుపమాలంకారములు సంస్కృతాలంకారికుల కాదరణీయములు గావు. సంస్కృతాలంకారికు లుపమకు సాధారణధర్మ బింబప్రతిబింబ భావాదు లుండవలయు నందురు. చూడుఁడు.

శ్లో. 'నృపం త మావ ర్తమనోజ్ఞనాభిః సా వ్యత్యగా దన్యవధూర్భవిత్రీ
మహీధరం మార్గవశాదు పేతం స్రోతోవహా సాగరగామినీవ."

ఇది రఘువంశములోని యిందుమతీ స్వయంవర ఘట్టమునంద లిది. "సాగరమునకు బోవుచు నది మార్గమున కడ్డముగ నున్న పర్వత మునకుఁ దొలఁగిపోవున ట్లజుని వరింపఁబోవుచు నిందుమతి మార్గమున నున్న యా రాజునకుఁ దొలఁగిపోయెను"అని యర్థము. ఇందుప మానోపమేయములు బింబ ప్రతిబింబభావమును బొందియున్నవి. బింబము కన్నఁ బ్రతిబింబమునకు హెచ్చుతచ్చు లుండవుగదా! కావున నుపమాలంకారమునందును నట్లే యుండవలయును. కానీ పాశ్చాత్యు లీ నియమమును బాటింపరు. చూడుఁడు.

But as a troops of Pedlars, from Cabool,
Cross under-neath the Indian Caucasus,
That vast sky-neighbouring mountain of milk-snow
Winding so high, that, as they mount, they pass,
Long flocks of travelling birds dead on the snow
Chok'd by the air, and scarce can they themselves
Slake their parch'd throats with sugar'd mulberries.
In single file they move and stop their breath,
For fear they should dislodge the overhanging snows.
So the Pale Persians held their breath with fear.
(Sohrob and Rustum).

ఇందుఁ దుదిపాదమునకుఁ దొమ్మిది పంక్తులుగల పై వాక్యమంత యు నుపమానము. గ్రంథవి స్తరభీతిచే దీని యనువాదమును వదలితిని. ఇట్టియలంకారములు రసానుగుణములు గామి ననువదింపక వదలివైచితిని. మఱియు భాషాంతరీకరణమునఁ బరభాషా సంప్రదాయములను వదలి స్వభాషా జాతీయలోకోక్త్యాదులను వాడుకొనవలయును. కావున నొక కథ దక్క నన్యమేమియు ననువదింప సాధ్యముగామి సొహ్రాబు అండ్ రుస్తుము అను కథను మాత్రి మలఁతిమార్పులతో ననుసరించి ద్వంద్వ యుద్ధ మనుపేర విరచించితిని. సహృదయులు నాప్రయత్నము సఫల మయ్యెనో విఫలమయ్యెనో సెలవిత్తురని నమ్ముచున్నాను.

గోకులము, సికిందాబాద్. గ్రంథకర్త.

# ద్వంద్వ యుద్ధము



౧

గీ. ఇరుల తెర నొత్తగింప రాతిరివెలంది
ప్రాగ్దిశాంగనమున నుషారమణి నిలిచి
ప్రకృతిగానంబునకుఁ బారవశ్య మొంది
లాస్యమొనరించుచుండె విలాసముగను. ౧

ఆ. వె. కాంచుచుండ మూఁడమంచు నల్దిక్కులఁ
బఱచెబిట్టు; మిఱ్ఱు పల్లములును
గట్టు గుట్ట లెల్ల చెట్టు చేమలుఁ జేలుఁ
గానఁబడియె వ్యక్త గతినిఁ బాసి. ౨

గీ. 'ఝౌకసా' నదినీటియట్టడుగునందుఁ
బ్రిభవముంగాంచి శైశిర వాతవితతి
సాఁగి యాపాదమస్తంబు జంతుకోటిఁ
గఱచు చుండెఁ గడుంగడుఁ గరుణమాలి. ౩

గీ. తన్నదీతీర శిబిరసంతానమందుఁ
దద్ద నిద్రించు చుండెఁ దార్త్తారదళము
సందు గొందులఁ జొరఁబడి చలి స్పృశింపఁ
గప్పుకొని కంబళులు నిజాంగములు ముడిచి. ౪

క. ఘనహిమముఁ జీల్చుకొనుచుం
జని తచ్ఛిబిరంపు మూలసందులఁబడి చొ
చ్చిన సన్న వెలుఁగు కనులకుఁ
గనఁబడ సాహ్రాబు లేచి కడు వేగమునన్. ౫

గీ. నఖశిఖాంతంబు యోద్ధృచిహ్నంబులయిన
దుస్తులందాల్చి, కత్తిని దోఁపి మొలను,
తొడిగియుం బాదములకుఁ బాదుకలతండు,
వీడి శిబిరంబు బయటికి వెడలుచుండె. ౬

ఉ. ఆ పొగమంచుఁ జొచ్చుకొని, యా చలిగాలి నెదుర్చి, చాత్మసే
నా పరివారవస్త్ర భవనంబుల దాఁటుచుఁబోయి "ఔకసా"
ద్వీపవతీ తటీవసుమతీధరమందలి పాడుకోటలో
స్థాపిత మైన యొక్క పటశాలను డాసె నతండు వెల్చనన్. ౭

గీ. డాసి తద్ద్వారమును నిరాటంకగతిని
నొత్తగించి కవాటంబు, నుర్వియందుఁ
బఱవఁబడియున్న మెత్తలం బాదమిడుచు
నతఁడు నిశ్శబ్దముగ లోని కరుగుదెంచె. ౮

మ. శయనింపంగ నిజాయుధంబులు స్వపార్శ్వంబందు, శీతార్తతన్
మెయినాచ్ఛన్న మొనర్చి దుప్పటమునన్, మేల్కాంచియున్ మంచమం
దు యథాపూర్వము నిశ్చలంబుగఁ బ్రసుప్తుండట్లు కాన్పించుచు
న్న యనీకిన్యధినాథుఁగాంచి యతఁడంతన్ నిల్చెఁ దత్సన్నిధిన్. ౯

గీ. వృద్ధసింహంబుఁ బోని యా వీరవర్యుఁ
డచటియలికిడి నాలించి యవలఁ ద్రోచి
మొగముముసుఁగును, గూర్చుండ సగము మేన
నాతఁ డాచారవందనం బాచరించె. ౧౦

క. ప్రతివందనమిడి సేనా
పతి కనుచీఁకటిగ నుంట వానిని స్వపుర
స్థితు గుర్తింపక యెవఁడో
యతఁ? డేటికివచ్చెనో? రయంబున నడిగెన్. ౧౧

౨

ఉ. అంతటసాఁగి రెండడుగు లాతని డగ్గఱి సోహరా బన్
వింత నెనేను? నీవెఱుఁగవే ననుఁ? గత్తినిఁ గర్జమందు నీ
మంతనముల్ గ్రహించుచుఁ గుమారునిరీతి మెలంగుమంచు భూ
కాంతుఁడు నాకుఁదెల్పెమునుఁ గావునఁ గర్జముగల్గివచ్చితిన్. ౧౨

గీ. హృదయ మూఱటఁ గాంచక నిదురరాక
మంచమునయందుఁ బొరలాడుకొంచు రేయిఁ
బలుమఱులు లేచి ప్రాగ్దిక్కువంకఁ గనుచు
వేగుఁబోకకుఁ గడిఁదిఁ దపించుచుంటి. ౧౩

గీ. పొడవఁగాలేద యింకఁ దూర్పునను బ్రొద్దు
నాదు నిద్దురఁ దారు గొన్నారొ? యేమొ?
ఁసైన్యములు మేలుకొన; వాకస్రవంతి
మంచున మునింగియుండె కాన్పించకుండె. ౧౪

గీ. కత్తిపట్టిన యా తొలిగడియతొట్టి
రక్తమును ధారవోసి తార్తారవిభువుఁ
గొలుచుచుంటి నెఱుంగవే? కోటిమంది
పెట్టుగానుంటి వయసునం బిన్ననయ్యు. ౧౫

క. కారాకూరపుటెదలం
గారాకులుమేయు చడవిఁ గస్తింబడు చు
న్నారలు పగఱెందఱొ! నా
వీరవిహారముల నెఱుఁగవే? నీవెల్లన్. ౧౬

ఆ. వె. తలఁతుఁగాదె! నాఁటఁదార్తారులపతాకఁ
బారసీకరాజవరునికోట
నవని నాల్గుచెఱఁగులందుఁ దార్తారుల
విజయచిహ్నములను వెలయఁజేయ. ౧౭

ద్వంద్వ యుద్ధము

క. సరవిం దుపాకికడుపున
ఫిరంగిగతి రుస్తుమునకు బిడ్డఁడనై యి
ద్ధరఁ బుట్టినాఁడ వని ప
ల్వూరు పెద్దలు నీవుఁదట్టి పొగడుదురు నన్నా. ౧౮

క. నన్నెఱుఁగని నాతండిరి
కన్నాకగు నాదు వీరగాథల విని ద
ర్పోన్నతి నెదుర్పరాఁగా
నన్నాతని కెఱుకపఱప నామదిఁ దలఁతున్. ౧౯

క. జ్ఞానమువచ్చినదాదిగ
మా నాయన జాడఁ దెలియ మహనీయాశం
బూనితి వీరవ్రతమును
మానుగఁ గననైతి వీరమార్తాండు నెటన్. ౨౦

క. జగదేకవీరపుంగవుఁ
డగు రుస్తుము నాదు జనకుఁ డన నలరెడు నా
పగిదిని గండరగండఁడ
నగు నేఁ దన సుతుఁడనన్న నతఁడెంతలరున్? ౨౧

క. నాపితృదేవునిఁ జూపక
పాపపుదైవంబు దుఃఖపఱచెదు; నాకీ
శాపాంతమున్నదో? లే
దో? పరమేశ్వరునికరుణయున్నదో? లేదో? ౨౨

గీ. ఆర్య! నాయాస లడియాస లగుట నకట!
యొగిని మామకయత్నంబు లూషరోప్త
బీజతతియాట నేఁడొక్కవిధముదోఁచె
నాదు నెడఁదకు మా పితృపాదుఁ గాంచ. ౨౩

క. నను ద్వంద్వయుద్ధమున డీ
కొనఁగలమొనగాఁడు లేఁ డొకొండును మరి మం
దునకైనఁ బారసీకుల
యనీకినీ యుద్ధమల్లురందుఁ దలంపన్. ౨౪

క. కానను సంకులరణమున
కూనింపక మొనల ద్వంద్వయుద్ధంబున కా
హ్వానింతు నాయిరానులె
మానాయనఁదెత్తురి వెదకి మార్కొన నన్నున్. ౨౫

క. ప్రత్యేక బాహువీర్యము
స్తుత్యముగాదనుచు రోసి శూరులు తుములం
బత్యంతంబు "యశో వా
మృత్యుర్వా" యనుచు మెత్తు రెక్కటిపోరుల్. ౨౬

క. అని భాషింపఁ జమూపతి
ఘనుఁడగు సొహ్రాబు వీరకంకణహస్తం
బును బట్టి సెజ్జ నుపవి
ష్టునిఁజేసియుఁ బలికె నివురుచున్ వానిమెయిన్. ౨౭

3

ఆ. వె. చిన్ననాఁటగోలె నిన్నాదరించు తా
ర్తారయోధకోటిఁ జేరి నీవు
తుముల సమరమందు మముఁగూడి మేల్గీర్తి
గొనక యేల ద్వంద్వరణముఁగోర? ౨౮

క. నినునెఱుఁగని నీతండ్రిని
గనుఁగొనఁగా నీకుఁ గోర్కి గలదేనిఁ గనుం
గొను మక్షతగాత్రుఁడవై
రణక్షతాంగుండ వగుచుఁ బ్రాపింపకుమీ! ౨౯

ఉ. నా పినవాఁట రుస్తుము రణంబుల హాస్తమ యాయుధంబుగాఁ
బై పడి కాలరుదుఁ త్రిడన వైరులఁ దున్నుచు రంగమెల్లఁ దా
నై, పులకింపఁ జూపఱు, జయధ్వనిమించఁ బెనంగు విక్రమా
టోపము మాఱుఁమ్రోగెడిఁ గడుంగడు దిక్కులఁ బిక్కటిల్లుచున్.

ఆ. వె. అతఁడు లేని పోరు; లతని కోడనివీరు;
లతని పేరు వినని యట్టివార;
లతని వీరపూజ లాచరింపనివార
లుండరైరి కోటి కొకరు నాఁడు. ౩౧

శా. ఆవీరోత్తముఁ డిత్తఱిన్ సమరసన్న్యాసంబుఁ గావించెనో?
దేవానాంప్రియుఁడై కృతఘ్నుఁడగు ధాత్రీనాథు పైఁ గొన్నక్రో
ధావేశంబున; వార్ధకంబున సుజీర్ణాంగుండుగానాట నెం
దే విశ్రాంతివహించెనో? కొలువఁ డయ్యెం బారసీక ప్రభున్. ౩౨

ఆ. వె. ద్వంద్వ యుద్ధమందుఁ బ్రతిఘటింపఁగ నిన్ను
వచ్చుఁ బారసీక భటవతంసుఁ;
డరుగుదెంచునట్టు లా వీరరుస్తుము?
వితయసుమ్ము! నీదు జతనమెల్ల. 33

ఉ. మానుము ద్వంద్వయుద్ధముఁ బ్రమాదము గల్గఁగవచ్చునీకు; స
మ్మానముతోడ నిన్ విడుతు; మాన్యుని రుస్తుము నీదు తండ్రినిం
గానఁగఁ బొమ్ము! కుమ్మరిచుచఖండపుఁబూన్కిని ఖండఖండముల్
నూనము మమ్ముఁ బాసిన నినుం గుశలిన్ విని సంతసించెదన్. ౩౪

క. తలయూపఁడు సొహ్రాబీ
పలుకులు విని; సాధ్యపడునె బంధింపంగా
బలితంపుఁ గొదమసింగము?
నిల రుస్తుముపుత్రునోపు నెవ్వండరఁపన్? ౩౫

ఆ. వె. కనుక నతఁడు గోరుకొనిన చందంబున
ద్వంద్వ యుద్ధమునకు బాసనేసి
వానిచేయి వదలి పంపింప సాహిబు
మోమునందుఁ జందమామ వెలిఁగె. ౩౬

౪

ఉ. ఆ దళవాయి కంబళము నావలఁదోసి, ధరించి యున్నియం
గీఁ దనమేనిపైఁ దొడి రొుగిం జరణద్వయమందుఁ బాదుకల్,
ఔఁదల నున్నిటోపియును, హస్తమునంగొని వేత్రదండముల్,
వీదికివచ్చెఁ గింకరుఁడు వెన్కొన వీడి పటీకుటీరముల్. ౩౭

చ. రవి యుదయించె నప్పటికిఁ బ్రాగ్దిశ; నా పొగమంచుదుప్పటం
బవలకుఁదోసి మేలుకనె "నౌకస" పూరము; బాలభాను భా
నువులును గ్రీడలాడుచు వినోదముగా విహరించుచున్న వా
యవనిరుహాళిఁ బాఱకుచు రయంబునఁ బాఱుచు సైకతంబులన్.

క. ధరియించి కవచముఖపరి
కరములఁ దార్తారసైనికశ్రేణులు ప
ల్వరుసలు దీఱిచి, వెనుకొని
సరదారుల, నడచినారు సమరస్థలికిన్. ౩౯

క. పులియంబెట్టిన గుజ్జం
బుల పాలం దావి వార్పులపైఁ, గొని యీా
ఱెలు, నలగొంతెతోల్ కుల్లా
యలతో నిలిచిరటఁ గొంద ఱాజానుకరుల్. ౪౦

క. లొటిపిటపాలం గ్రోలెడు
భటతతి, తలఁగఱచియుండు వలువకుళాయల్
చిటిగడ్డంబులు గలిగిన
భటపంక్తులు నిలిచె వారువపు మొనవెనుకన్. ౪౧

చ. వరుసగ నుత్తరధ్రువపు బ్రాంతమునం దిరుగాడు మేటి పో
టరులు, ధరాధరంబుల నెడారులఁ ద్రిమ్మరునట్టి దుర్దముల్
పరువడిఁ దట్టు గుఱ్ఱములస్వారి నొనర్చెడి దండిమానిసుల్
చరచర వచ్చి నిల్చి రల సంగరరంగమునందుఁ బిమ్మటన్. ౪౨

క. ఈరీతిఁ దీరి యుద్ధ
ప్రారంభము ముందు, వీరిల బ్రహ్మాండము తా
ర్తారచమూవారము సిం
హారవములఁ జేయ దొడఁగె నత్యుద్వృత్తిన్. ౪౩

చ. కవచశిరస్త్రముల్ తొడిగి, కత్తికటారులు బాకు లీటియల్
దివి భువిఁ దల్తళల్ కురియఁ, దేజము మూర్తివహింప, వేఁగుగా
నవసికిఁ బారసీకవిభు నశ్వపదాతి చమూసమూహముల్
బవరపునేలపై కుడికి వచ్చి నిలంబడె నొక్క దిక్కునన్. ౪౪

క. పరసేనపైకిఁ దలపడఁ
ద్వరపడు తమపౌఁజుడాసి దళపతి యెదుటన్
గిఱగీచి నిలిచి ముందున
కడుగిడుగును జరుగవలవ దని యాఁకట్టెన్. ౪౫

గీ. వానిఁగని యాయిరాను సేనాని నిలిచి
తనదు సేనాముఖాన వేత్రంబు నెత్తి
కేళ్ళువాఁడంగఁగడఁగు స్వకీయసైన్య
కంధి నాఁచెను జెలియలికట్టవోలె. ౪౬

క. ఆ తార్తారచమూపతి
యాతఱి నిశ్శబ్దవృత్తి నటఁగల పృతనా
వ్రాతద్వయంబు నడిమికి
నేతెంచి వచించె నిట్టు లెల్లరు వినఁగన్. ౪౭

ఆ. వె. పారసీక సేనలార! ఓ తార్తారు
లార! వినుఁడ! ఆఁపుఁడా! రణంబు
శూరవర్యులైన పారసీకుఁడును సొ
హ్రాబు ద్వంద్వయుద్ధ మాడవలయు. ౪౮

ఆ. వె. మలయమారుతంబువలెఁ గొల్పెఁ దార్తార
జనుల కతని పలుకు సమ్మదంబుఁ
జండమారుతంబు సరవి దుఃఖముఁగొల్పెఁ
బారసీకతతికి వాడ్చి మొగము. ౪౯

౫

ఉ. అంతట నా యిరానుపృతనాధిపు లందఱు గూడి యొక్క యే
కాంతతలంబునందు నిది 'యానని కాద'ని కొంతసేపు రా
ద్ధాంతములాడుచుం దమ ప్రధానచమూపతి డాసి యిట్లు సి
ద్ధాంతముఁ దేల్చి తుట్టతుది కాఁడిరి యోడక యేకకంఠులై. ౫౦

క. మన పారసీక వీరా
గ్రిణు లా సొహ్రాబుతోడఁ బ్రతిఘటియింపం
గనుజాలరు ముమ్మాటికి
వినుమిది నిశ్చయపరిచంబు పృతనాధీశా! ౫౧

ఆ. వె. వాఁడు లేఁడికాళ్ల వాఁడు; బల్ సింగంపు
టెడఁదవాఁడు; దొడ్డకడిమి వాఁడు;
కండ దేఱినట్టి గట్టి రెట్టలవాఁడు;
చిన్నయయ్యుఁ జేవ మిన్నవాఁడు. ౫౨

క. తలఁచుచుఁ జిచ్చఱ పిడుగని
పలువురు పోటరులు ముందువడకయ తమక
త్తులఁ గాన్కలిచ్చి యతనికి
నలఁగుచు నెయ్యంబుసూపి యరుగుదురు సుమీ! ౫౩

ఆ. వె. కనుక ద్వంద్వయుద్ధమునకు సమ్మతి సేఁత
సముచితంబుగాద; శ్లాఘ్యమైన
సంకులాహవంబె సర్వథాఁ స్పృహణీయ
మనఁ జమూవిభుండు విని యదెల్ల. ౫౪

గీ. అప్రతిద్వంద్వి నంచు బాహాస్ఫలించి
పిన్నవాఁడైన సొహ్రాబు పిలుచుచుండ
ద్వంద్వరణమున కొగ్గమిఁ బారసీక
భటవరుల కిస్సిరో! తలవంపుగాదె? ౫౫

క. మన మొనలేమిని సొహ్రా
బునకుం బ్రతిభటుఁడు గొడ్డువోయెనె? దేశం
బున వీరక్షామము వ
చ్చెనె? రుస్తుములేఁడె? యతఁ డజేయుఁడు గాఁడే? ౫౬

ఉ. ఆతఁడు పారసీకపతి న్యక్కృతి వీరకథాపరిసంగముల్
చేతమునందుఁ జొన్పక వసించుచునుండెను దండిరియొద్ద; మీ
రాతని పాలి కేగి వెస నా సొహరాబుని ద్వంద్వసంగరా
హూతియుఁ దత్పరాక్రమసమున్నతియున్ వెయినోళ్లఁ బల్కుఁడా!

క. సహియించునె బాలుండగు
సొహరాబుని వీరహూతి శూరావళికిన్
మహి మున్గుండెలు దీసిన
మహాభటుఁడు రుస్తు? మేల మాటలు పెక్కుల్? ౫౭

క. విని వీరాహ్వానంబును
మన రుస్తుము మేను వెరుగ మారాడక వ
చ్చును మఱచి పరిభుతిరస్కృతి
ననికినిఁ, గుమ్మిచును వచ్చునాఁబోతు వలెన్. ౫౮

క. వీరాహ్వానంబును, బ్రీతి
వీరుని సందీపకోగ్రి వీర్యసమృద్ధిన్
భీరువువలె విని సైఁచునె?
వీరుని మూఁపురము లెమగవే నిక్కముగన్? ౬౦

ఆ. వె. అనుచుఁ బలికి వారి ననిచి రుస్తుము నొద్ది
కతఁడు శత్రుసైన్యపతిని డాసి
ద్వంద్వయుద్ధమునకుఁ దమసమ్మతిం దెల్పె;
మొనలు మఱలఁ జేసి కొనిరి వారు. ౬౧

౬

క. తమ సేనాపతి నోడివిన
క్రిమంబునను బారసీక రాహుత్తులొగిన్
దమరాజ్యపు టెల్లలతి
క్రిమించి మెఱపు లనఁ బఱచి కడుదవ్వులకున్. ౬౨

క. తనచీఁకుముసలిదండ్రినిఁ
బొనరఁగ గొలుచుచుఁ బితౄణ మోచన లాభం
బున విభుని యవజ్ఞను మన
మున మేలుగఁ దలఁచు రుస్తుముం గాంచి రటన్. ౬౩

ఉ. వచ్చిన ప్రాఁతనెయ్యుర గుబాలున రుస్తుము గ్రుచ్చి, స్వాగతం
బిచ్చి, శుభాసనంబు నిడి యెల్లర సేమమెఱింగి వేఱుగా
వచ్చిన కారణం బడుగ వారలు నా సొహరాబు బాహు ద
ర్పోచ్ఛ్రతయుం దదీయ రణహూతియుఁ బేర్కొని వేయినోళ్లన్.

క. పదిమంది రుస్తుములు న
న్నెదిరింపఁగ లేరు లాఁతులెం తని కడుబె
ట్టిదముగఁ బంతము లాడును;
ద్వాదీయ బాల్యంబుతోఁచు వానిం గనఁగన్. ౬౪

## ద్వంద్వయుద్ధము

క. మా పారసీకవీరులు
కాపుడిగిన చెట్లపగిదిఁ గడు వృద్ధతమై
నేపడఁగియుఁ, గోపడఁగియు,
నోపరు సోహ్రాబుధాటి కుక్కుటియుఁ గదున్. ౧౬

గీ. ఆఁదుకొనకున్న నీయట్టి జోదు నేఁడు
మన యిరానుల మర్యాద మంటఁ గలియుఁ;
జలివెలుఁగుఁగాంచ వెన్నెల పులుఁగులట్లు
నిన్ను దర్శింప మొనలు గూర్చున్నవయ్య! ౧౭

క. అని పలికిన పలుకుల కా
త్మను నగి మీపారసీక మానవనాథుం
దునకును బ్రాఁబడి చిలుమె
క్కిన రుస్తుము కత్తి యేటికిం గావలసెన్ ? ౧౮

ఆ. వె. జీర్ణులేనిఁ బారసీక యోధాగ్రిణు
లేఁబదేండ్ల రుస్తుమెట్లు యువకుఁ ?
డితఁడు చాలు నెట్టు లెక్కటి పోరికిఁ
జదురులైన వారు చాలకున్న ? ౧౯

శా. ఇల్లున్ వాఁకిలిఁ బాసి తిమ్మరిగఁ బెక్కేండ్లీ ధరాజానులన్
ఒళ్ళర్పించి భజించుచుండఁగ, బలాఢ్యుల్ శాత్రవుల్ బాహుద
ర్పోల్లాసంబున వృద్ధు నా జనకునిన్ యుద్ధంబునం దోర్చి నే
లెల్లం గైకొని త్రోలిఁ బ్రాణములతోఁ నిందున్నవాఁడిత్తఱిన్.౨౦

చ. తెలిసిన మూర్ఖుఁడోట గణుతింపక యాత్మహితంబుఁ గోరు పె
ద్దలఁ, బనితీఱఁగా, నదిని దాటిన పిమ్మటఁ దెప్పఁగాల్చి న
ట్టులు ననుఁ ద్రోసిరాజని కడుంగడుఁ బిన్నల నాశ్రయించె దు
ర్బలులను; గ్రొత్తవింతయును బ్రాఁతది రోఁతగదా! జగంబునన్.౨౧

క. నను నేకపుత్రుఁ గాంచిన
జనకుని శుశ్రూష సేయఁ జాలమి నా యీ
వనము కృతఘ్నప్రభు సే
వనమున సత్యముగఁ బొందెనై యర్థ్యంబుల్. ౨౨

గీ. వ్యాఘ్రశాబంబుఁ బోని సాహ్రబువంటి
పుత్రుఁడొకఁడున్న నాకిట్లు పుత్రిగాక
ఈదృశకృతఘ్న రాజకమ్మృగగణంబు
వేఁటలాడుచుఁ దృప్తిఁ గల్పింపకున్నె ? ౨౩

క. ఈ మూర్ఖు, నీకృతఘ్నుని
భూమీ ఖండమున వాసమును గావింపన్
నా మదిని రోసి రాష్ట్రపు
సీమాంతము సేరి యిట వసించుచు నుంటిన్. ౨౪

చ. అతని సహానువర్తన సహాసన మజ్జన భోజనాద్యలం
కృతులను బొందుచుం బవలు రేలు వినోదము లాడు చంగనా
తతివలెఁ బూడ్చిపెట్టి తమదర్పము విక్రమ సాహసంబులన్
బ్రతుకు ప్రవీరకుంజరులె రాఁగల రాసాహరాబు మారొ్కనన్. ౨౫

ఆ. వె. కుడుచుఁగాక తనదు చెడుగు సేఁతలకైన
శాస్తి; బుద్ధివచ్చు సరిగ దాన;
బాసనేసియుంటిఁ "బట్ట నీ దారుణ
హస్తమందు శస్త్ర" మంచు మున్ను. ౨౬

క. అని కినిసి రుస్తుమాడఁగ
విని యా సరదార్లు పెద్దవేఁడినిఁ బుట్టిం
పనియెడ నీతం డొగ్గం
డనిపరుసములాడఁ దొడఁగి రాతని నిట్టుల్. ౨౭

గి. గండ పెండేరములు దాల్చి గండుమెఱసి
మల్ల చఱచుచు నప్రతిమల్లుఁ డట్లు
బాలకుండైన సొహ్రాబు పంతమాడఁ
జల్లఁబడె నేమి? మేని నెత్తెల్ల నీకు ?  ౭౮

గీ. ద్రవ్యలుబ్ధుం డుపార్జిత ద్రవ్యమట్లు
ప్రాప్తమగు కీరితికి భంగపాటు లేక
ప్రభు తిరస్కృతి మిషను గాపాడుచుంటి
రుస్తుమా ! యెంత గడుసరిపోఁడ వీవు !  ౭౯

ఆ. వె. నీవు రావుగాని నిజముగా వచ్చిన
నతఁడు నీదు బిరుదు లపహరించి
చెనకి నిను 'జితోఽస్మి' యనిపించి నీ నోట
మరలుఁగాని యుఱక మఱలఁ బోఁడు.  ౮౦

ఆ. వె. దండి మగలు లేని తఱి మల్లమార్తాండ
మౌళివైతి వీవు; మహి నిరస్త
వృక్షమైన చోట పేరండ తరువాండె
వృక్షరాజ మన్న పేరుగొనదె ?  ౮౧

గీ. "ఇంతకాలంబు జీవించి యింటి వెనుకఁ
జచ్చె" నన్నట్టి లోకోక్తి సంభవించె
వీరశయనంబుఁ గాంచఁ బిర్వీఁకుచున్న
త్వాదృశ భటావతంసుల వల్లఁగాదె !  ౮౨

క. అని రెచ్చఁగొట్ట వారలు
విని రుస్తుము మనసు రగులఁ బెరుగంగ నొడల్,
కనుబొమ్మలు ముడివడఁగాఁ
గనఁబడె జ్వాల్వెటికి నట్టి గవిసింగ మనన్.  ౮౩

క. ఆ మ్మానవ శార్దూలము
తమ్మెక్కడ విడిచి తినునో ? తమి నని ముఖ ప
ద్మమ్ములు వాడఁగఁ గడుశు
ష్కమ్ములుగాఁ బెదవు లళుకుఁ గాంచిరి వారల్. ౮౪

శా. ఏమీ! నర్ గెలువంగఁజాలు మగవాఁ డేతెంచెనే? భూమియున్
వ్యోమంబుం దలక్రిందులయ్యెనో? యలాబుల్ మున్గి రాల్ తేలెనో?
నా మైఁ బ్రాణములుండ మిన్నయగుచున్ నాకన్న దోర్విక్రమో
ద్దాముండై సుతుఁ డున్న సైఁపను యథార్థం బన్యులన్ సైఁతునే? ౮౫

క. ముట్టను శస్త్రంబని నే
నొట్టిడు కొన్నాఁడ; మరియు నుచితంబె జగా
జెట్టి యగు నా కతుల్యుఁడు
పట్టియు నగు సోహరాబు పయికీ దుముకన్. ౮౬

క. అని రుస్తుమాడ వారలు
విని నీ శంకాద్వయమ్ము వీడుము చిత్త
మ్మున నుండి రమ్ము బవర
మ్మొనర్పఁ బ్రచ్ఛన్న వేష మూని సఖుండా! ౮౭

క. తెలుపము నీరాకెవరికిఁ
దెలుపకు పగతునికి నామధేయము నీవున్
గలుగదు నీ కపకీర్తి
కలుగును విజయంబు మా కఖండముగ సఖా! ౮౮

క. అని యుక్తిఁ దెలుప, రుస్తుము
జనపతిపైఁ గ్రోధమున్న స్వపరాక్రమ మదూ
షణము సహింపక యనికిం
జనె ముదితుల వారిఁగూడి జవనాశ్వముపై. ౮౯

## ౭

క. నలుదెసలఁ బూని బల్లెం
బులు బారులు దీర్చి సైన్యములు కనుచుండన్
నిలఁబడె వృక్షావృత శా
ద్వలసమరంగమున వటమువలె రుస్తుమనిన్. ౯౦

గీ. కాదు మున్ను ధరించెడి కంకటంబు;
కాదు తొంటి శిరస్త్రంబు; కాదు చేతి
కత్తియుం గేడెమును బూర్వకాలధృతము;
లిట్లు ప్రచ్ఛన్నుఁడై రుస్తు మేగుదెంచె. ౯౧

గీ. పాత్రధారిని గని స్వరూపమును బోలె
నతని జూపఱు గుఱుతింపరైరి సరిగఁ
గాని యాజానుబాహుతఁ గండపుష్టి
స్థూలకాయతఁగని శంక దూర్చిరెదల. ౯౨

శా. తన్నున్ దిక్కుల నన్నిటన్ వెదకుచున్ దర్పించి, యోధాళికిన్
గన్నాకై, పరధూమకేతు వయి, దోర్గర్వంబునన్ వీగుచున్
గున్నేన్గట్టులు, నాలపోతు వలెనున్, లోకాళికిం దోఁచు నా
పిన్నన్ రుస్తుము వచ్చుచున్న సొహరాబ్వీరాధివీరుం గనెన్. ౯౩

చ. కవచశిరస్త్రముల్ మెయినిఁగప్పఁగఁ జీఁకటిమ్రానిచందమై
జవజవలాడ నేల, పెలుచం జరణన్యసనం బొనర్చుచున్
విపులగభీరిమన్ వయసు మించిన వాఁడితనంబు గల్గి త
న్గవయఁగవచ్చు బాలుఁగనఁగా వెఱగయ్యెను వాని యాత్మకున్. ౯౪

క. "ఏతలిదండ్రుల పున్నెపు
సేఁతల యపరంజిపంట చిఱుతుకయగు వీ ?
డీతనిపైఁ బగపైవలెఁ
జేతము మండక వహించు శీతలతఁ గదున్. ౯౫

క. ఒకపోటున కాఁగఁడు; వృ
ద్ధికాముఁడగు బాలు నితనిఁ దెగిఁ గొన నాకున్
అకటా! మన సొప్పద"యని
నికటమునకు రుస్తు మాతనిం బిల్చి యనెన్. ౯౬

క. ఓయీ! కుమార! భువి దీ
ర్ఘాయుష్మంతుండవై సమస్త సుఖంబుల్
హాయిగఁ బొందక మృత్యువు
కై యన్వేషింతు వేల? యనభిజ్ఞుఁడవై, ౯౭

శా. చిందుల్ ద్రొక్కుచు రక్తపుర్ మడుఁగులం జెండాడుచున్ శత్రురా
ట్సందోహంబును సింహనాదములతో డన్ మాఱుమ్రోగం దెసల్,
అందు న్నిందును నెందుఁ జూచినను నేనై యుద్ధరంగంబు నె
ల్లందర్పంబున గుత్తకుం గొనిన లీలం బెద్ద క్రీడించితిన్. ౯౮

క. మిత్త్రికిని మిత్త్రియగు నా
కత్తికి నెరసేయ నిన్నుఁ గాంక్షింపను నా
చిత్తమున; రమ్ము నాదగు
పొత్తుండుము; చూతు నిన్నుఁ బుత్త్రునివోలెన్. ౯౯

క. నినుఁబోలు తనయుఁ డుండిన
రణవిద్యా మర్మములఁ గఱపి లెస్సగ నా
తని నేకవీరుఁగాఁ జే
తున వేయేటికిఁ? భువన చతుర్దశకమునన్. ౧౦౦

క. త్యజియింపుము తార్తారుల
భజియింపుము మా యిరాను వర్గము నీతో
బుజములు గలిపెడి యువకుఁడు
నిజముగ లేఁడొక్కరుండు నేఁ డీ నేలన్. ౧౦౧

ద్వంద్వ యుద్ధము

క. అని రుస్తుమాడ, నాతని
ఘనాఘనారవముఁ బోని కంఠస్వరముల్
విని, యైరావత రూపము
గని సొహ్రాబునకు శంక గలిగె నెడందన్. ౧౦౨

క. తొలి విన్న కవచఖడ్గా
దులు గనఁబడకున్న నెట్టెదుట మార్కొనఁగా
నిలిచిన ద్రిఢిష్ము విగ్రహ
మలరింపఁగ డాసి యాతఁ డా రుస్తుమునిన్. ౧౦౩

గీ. కౌఁగిలింగొని యతని మోకాళ్ళు, వాని
కేలుదమ్మిని గ్రహియించి కేలుదమ్మి
నాత్మసాక్షిగ "నయ్య! బాసాడి తెలుపు!
నిక్క మా వీర రుస్తుము నీవకావె? ౧౦౪

ఆ. వె. వెదకుచుంటి నతనిఁ బెద్దకాలము నుండి
తిరిగినాఁడ దేశ దేశములను
అడుగుచుంటిఁ దెలుపుమా వీర రుస్తుము
నీవకావె? చెప్పు నిక్కువముగ." ౧౦౫

క. అనుచున్ సొహ్రాబుడుగఁగ
విని రుస్తుము తలఁచె "నాదు పేర్దాఁపక బా
లునితో నాలమొనర్చుట
యనుచిత మీ జయము మానహానికి లాగున్. ౧౦౬

ఉ. "ఈతనితోడఁ గయ్యమన నేలొకొ? కల్గెడుఁ గొంకుపాటు నా
చేతమునం దలంతి; ననుఁ జేతులు వెన్కకులాగుఁ; గ్రొత్త యీ
రీతి; నెఱుంగనెప్డు; నిజవృద్ధతచేతనొ? వీర బాలకుం
డీతఁడు; సంశయింతు జయ మీస్థితి నామము నెట్లుదెల్పుదున్." ౧౦౭

క. అని తలఁచి యోరి డింభక!
అనవసర ప్రశ్నలేల? యా రుస్తుముతో
డన కాని లాఁతితో నీ
వనిసేయవె? నీ ప్రతిజ్ఞకాఁగి నిలువుమీ! ౧౦౮

గీ. పూని చింబోతు కారెనుబోతుఁ బోలె,
గిత్త యాఁబోతునుం బోలెఁ, గెరలి నీవు
పయికి మోరెత్తి అంకెలు వైచుకొనుచు
రుస్తుముఁ బ్రవీరసింహు మార్కొనఁ దలంతె? ౧౦౯

మ. జనముల్ రుస్తుము పేరువిన్న సుమహాశార్దూల నామంబునన్
వినిన ట్లూఁడనిఁబాఁడు చుందు ప్రసమరోర్వింబాసి దావవ్వః వా
నిని నీవిచ్చటఁ గాంచ యుద్ధకథ సందిగ్ధంబ కాకున్నె ? కా
వున వేయేటికిఁ ? బోటికిన్ నిలువుమీ ! పోపొమ్ము ! లేకుండినన్.

గీ. కాచుకొనవోయి ! తావకాంగములఁ దఱిగి
కాకులకు గ్రద్దలకుఁ దృప్తి గలుగఁజేతుఁ;
దావకాస్థుల నన్నింటి దంచి పొడిగఁ
బాఱఁజిమ్ముదు "నౌకసా" పూరమందు. ౧౧౧

క. అని పలుకఁగ సొహ్రా బను;
విను ! నీదుబిభీషికలకు వెఱవఁగ నే బి
ల్లనుగాను ! సుమ్ము ! సొహ్రా
బను; మాటల వలదు; చూపవలెనయ్య ! క్రియన్. ౧౧౨

క. సమరము సందిగ్ధము రు
స్తుమున్న నిట నంచుఁ బల్కుదువు నిజమీ వా
క్యము; నేనాతనికై య
త్నము సేయుచు నున్నఁదాఁ గనంబడకుండెన్. ౧౧౩

ద్వంద్వ యుద్ధము

క. నాకన్న నోడ్డుపోడుగగు
నాకారముఁ బెద్దపాఁయ, మనుభవము నరిఁ
నీకున్న దనుచు దర్పో
ద్రేకమును వహించి పేలితివి స్వైరముగన్. ౧౧౪

క. తలఁపకు నీకేజయ మని
తలకిందగుఁ గాల మొక విధంబునఁ జనఁబో;
దిలపయి బండ్లోడలు నో
డలు బండ్లగునని వినంబడదె పెద్ద లనన్? ౧౧౫

గీ. ధర నతిగభీర సమర సాగరమునందు
మజ్జనోన్మజ్జనంబుల మలఁగునపుడు
ఎవఁడు మునుఁగునో! తేలునో? యెవఁడు తుదికి
నిర్ణయింపంగ మానవుల్ నేర్తు రొక్కొ? ౧౧౬

గీ. చీమ తుమ్మను దిగ్దంతి చెవుదుపడఁగ;
దోమ కుత్తుక నేనుంగుఁ దూఱఁగలదు;
మూషకము మ్రింగు సింగంబుఁ; బుడమియందు
వీర్యము వ్యవస్థితముగాదు; విధివశంబు. ౧౧౭

౮

క. అని పల్కఁగఁ బ్రత్యుత్తర
మును నొడువక విసరె రుస్తుము మహాభల్లం
బును ఘోరమృత్యు శితదం
ష్ట్రను బోలిన దాని బాహుసారము మెఱయన్. ౧౧౮

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
నచ్చున రివు రివ్వు మనుచు నాభల్ల మొగిన్
వచ్చుచునుండెను బెదర వి
యచ్చరతతి సోహరాబు నంగముపైకిన్. ౧౧౯

గీ. ఎగిరి సొహాబ్రిబు పిచ్చుకపగిది దాని
గుజికి బారెడు దాలకు నజికి నిలిచెఁ
జీరికిం గొననట్టులు చిఱుతనగవు.
మోముదామరపై లాస్యమును బొనర్ప. ౧౨౦

ఆ. వె. వాటుదప్పివచ్చి బల్లెంబు రివ్వున
నేలఁదాఁకెఁ; బెల్లు ధూళిరేఁగె
వీరరుస్తుమునకుఁ బిచ్చికోపము రేఁగె
నాదియందె హంసపాదటంచు. ౧౨౧

ఉ. పిమ్మట సోహరాబు తన పిన్నతనంబు వహింప వన్నెద
ర్పమ్మున శాతకుంతమును వైచెను రుస్తుముపైకి; దీన సం
తమ్మును బొందు సీతఁడని తద్భటకోటి దలంచునంతఁ గే
డెమ్మును దాఁకె; దాన నిగిడెఁ ధ్వని దిక్కులఁ బిక్కటిల్లుచున్.

శా. వీరోత్తంసుఁడు రుస్తుమంగము విజృభింపంగ రౌద్రింబునన్
వీరోద్వేజక కాలదండమునకున్ బెద్దన్నమై, గోత్రభి
త్స్ఫారోగ్రాశని చుట్టమై తగు గదాదండంబు సొహాబ్రిబుపై
సాగించెన్ వడిఁ ద్రిప్పిత్రిప్పి స్వభుజాసత్త్వంబు దీపింపఁగన్. ౧౨౩

ఉ. ఆ గుదెవ్రేటుఁదప్పుకొన నా సొహరా బొక గంతువేసి ద
వ్వేగియలంతి నిల్చి హసియించుచు నుండఁగ రుస్తుమా గదా
వేగముచేతఁ దూలి మెయి పృధ్వినిఁగూలి యొకింత విక్రమా
భోగము మొక్కవోవ మొగముం బయికెత్తక సిబ్బితింగొనెన్.

గీ. చదికిలంబడి, మోకాళ్ళు సైకతమున
గుచ్చుకొన, ధూళిపర్వ ముక్కునను నోట
నకట! ఉక్కిరి బిక్కిరై యాతఁడుండె;
నవ్వు సొహాబ్రిబుఁ గాంచి మానసము మండె. ౧౨౫

గీ. తదవకాశంబు దొరక నిర్దయత నుఱికి
మరి యొకండేని రుస్తుము న్నఱికియుండు
ధర్మవీరుండు సాహ్రాబు తగ్గి వెనుక
కాడె బహుమాన పూర్వకం బతనితోడ ౧౨౮

క. తల తిరిగి పడితివయ్యో!
మెలమెల్లఁగా లెమ్ము! నన్ను మేదింపంగాఁ
దలఁపకు; మిటు లోడ లెఱుఁగక
చెలిరేఁగినఁ గర్జమగునె? చెందుము శాంతిన్. ౧౨౯

చ. నిలువదు నిల్పఁ బూనినను నీపయిఁ గింకిరి పాఱెడంద; మొ
క్కలివగు నీవు రుస్తుమవుకాదని పల్కుదు; వీఁడుచెన్నిమో!
కలఁకుల నెత్తురొల్కఁ మొనగాండ్రి వధించితిఁ బిన్ననయ్యు; నీ
వలె హృదయస్పృశుం డయినవాఁడు గనంబడఁడయ్యె నెయ్యెడన్.

క. కల్పితమగు కోపంబునె
నిల్పితి వీ వైనమదిని; నిక్కము నాకుం
దెల్పుము! మనకేదో పా
క్కల్పపు సంబంధ ముండఁగలదని తోఁచున్. ౧౨౯

క. రమ్ము! మన యాయుధమ్ముల
నిమ్మేదిని నాఁటి, ముట్టి, యెల్లని సారా
యమ్మును గావింతము నె
య్యమ్మును వైరమ్ముఁ గడిగి యాత్మలయందున్. ౧౩౦

ఉ. గండర గండలైన మొనగాండ్రిరు పెక్కురు పారసీకపున్
దండున లేరె నన్ జెనకఁ? దద్విధిలేరొకొ మాదుసేన ను
ద్దండులు నిన్ను డీకొనఁగఁ? దావక మామక దోఃపరిచండతా
పాండితి నెల్లఁ జూపుకొనవచ్చును బెద్దగ నిర్విచారతన్. ౧౩౧

క. ప్రాయంబుఁబట్టి పెద్దవు;
చేయెత్తి నమస్కరింపఁ జెల్లును నాకుం;
బాయని చెలిమిని విజయం
చేయుము నాతోడ మాదు శిబిరంబునకున్. ౧౩౨

క. సొహరా బిట్లాడఁగ దు
ర్వాహ రౌద్రముఁ బూని లక్ష్యభంగంబునకున్
మహిపాతమునకు రుస్తుముఁ
బరిహరింపఁగ లేచి మరల బల్లెము వట్టెన్. ౧౩౩

క. తన ముదిప్రాయమ్ము, నసమ
ర్థనమును గని పరిహసింపఁ దలచెనో ? వీఁడం
చును మదిమండెను రుస్తుము;
జనుఁడు పరాజితుఁడు తలఁచు సహజముగ నిటుల్. ౧౩౪

క. వదనమునఁ గ్రాలబొమముడి,
హృదయముపై కెగయుచుండ, నెంతయు వణఁకం
బెదవులు, పలుకఁగ నినుమా
ర్మదిఁ గడఁగియు రాక తుదికి మాటాడె నిటుల్.. ౧౩౫

క. కనుఁగవఁ దెఱవని కూనవు;
ననుఁ బరిహసియింపఁ గడఁగినాఁడవె ? యిటు; పి
ల్లను గ్రుడ్డువచ్చి హసియిం
చిన విధమున నుండె నీదు చెయిదము తలఁపన్. ౧౩౬

శా. ఓరీ! డింభక ! యెంచితే ? యిచట మీయుద్యానమందున్న తా
త్తారీ బృందముఁగూడి పాడుచును నృత్యంబాడు చున్నట్లుగా
వీరక్రీడలు వీరతాండవములున్, వీరోత్సవంబుల్ తగం
బ్రారంభింతము రమ్ము ! ఘోరమగు సంగ్రామాఖ్యరంగస్థలిన్.

గీ. కట్టిపెట్టి సంధి కబురులు, నెయ్యంపుఁ
దియ్యములును రమ్ము! కయ్యమునకు
నీప్రతిజ్ఞ కాఁగి నిలుపుమా! మగపాఁడిఁ;
గనికరింప నిన్ను మనసురాదు. ౧౩౮

క. నటిచందంబున నిర్విధి
నటించుటం జేసి యంగనామణి వీ వి
చ్చటి కేలవచ్చి తిసిసీ!
విటకాండ్రను వెదకికొనుచు వే చని యెటనే. ౧౩౯

౬

క. అను పలుకులు సాహాత్రిబుని
మనంబునను జిచ్చు రేప మాటాడ కతం
డును గూర్రకాల సర్పం
బును బోలిన కత్తిదూసి ముంగట నిలిచెన్. ౧౪౦

క. ఇల నాబోతెనుపోతుల
వలె, సింహ వ్యాఘ్రముల విభాతిని, ఘనదో
ర్బల ముష్టికచాణూరుల
వలెనుం గలియంగఁబడిరి వారొండొరులన్. ౧౪౧

క. బలిమిని మగఁటిమిఁగొని వా
రలు తీవ్రతఁ గుమ్ముకొనఁ బరస్పరమును జే
తుల్ల కేడెంబు లెదుర్కొనె
నలగిరియుగమట్లు ఘోరమగు ధ్వని రేఁగెన్. ౧౪౨

చ. పెనఁగుచునున్న యాప్రబల వీరులకయ్యపుఁగళ్ళమందుఁ గ్రి
వ్వనఁ దిమిరంపుగుంపులు ఘనమ్ముగఁ గ్రమ్మె; విరుద్ధమైన య
య్యనిఁగనరోసి మేఘపటలావృతుఁడై రవిడాఁగెఁ; దీవ్రమై
పెనుసురగాలి రేఁగి పెనవేసెను వారిని బెట్టిదమ్ముగన్. ౧౪౩

క. పాలికలను దక్కఁ దక్కిన
పాలమెల్లను వేవెలుంగు పూర్వమున వలెన్
వెలిఁగించుచుండె; సైన్యా
వళి నిలిచె యథాపురం బబాధితరీతిన్. ౧౪౪

క. చెరుగుచుఁ గన్నుల నిప్పులు,
బరువుగ నిట్టూర్చుకొనుచుఁ, బటపటఁ బండ్లం
గొఱుకుచుఁ, బెదవులు గీటుచు,
నికులున చురమాడుచుండి రీ యిరువురున్. ౧౪౫

శా. వీరోత్తంసుఁడు రుస్తుమత్తఱిని దుష్ప్రేక్ష్యాహవావేశ మొ
ప్పారన్ వ్రేయఁగఁ దీక్ష్ణకుంతమును వ్రియ్యల్ వాఱె సొహ్రాబుఁ డా
ల్వాఱత్యంతము; గాత్రి మక్షతమయై భాసిల్లెఁ; గ్రోధారుణే
క్షాహాక్షుండయి మూల్గి లాగుకొనె వేగన్ రుస్తుమా బల్లెమున్.

ఉ. పిమ్మట మృత్యుజిహ్వయనఁ, జెన్ యమహస్తమనంగఁబొల్చు ఖ
డ్గమ్ముననా సోహరాబు వికటమ్ముగ రుస్తుముఁ దాఁకఁగా, శిర
స్త్రమ్ముపయిన్ వెలింగెడి తురాయి ధరంబడి ధూళిబ్రింగె; స
త్యమ్ముగ నింతవ ట్టెఱుఁగఁ డాతఁడు తాదృశ శృంగభంగమున్. ౧౪౬

క. క్రమముగ గాఢతరంబయి
తిమిరము పెరిగెన్; మెఱుంగుఁదీగెలు మింటన్
భ్రమియించె; నుఱుము లుఱిమెను;
సమీపగ నిజాశ్వ మేడ్చె జాలింగొనుచున్. ౧౪౭

గీ. ఆ హఠాత్కృత హయరోదనారవంబు
విని భయంపడి యిరుసేనలును గలంగెఁ
గటకటా ! ఓకసానది కరుడువాఱెఁ
బిడుగువడి ప్రాంతవృక్షకం బడఁగె నేల. ౧౪౮

## ద్వంద్వ యుద్ధము

క. సొహరాబు జంకుగొంకులు
వహియింపక దూకి వానిపైకిఁ గడుదురా
గ్రహమున మరల శిరస్త్రముఁ
బ్రహరింపఁగఁ గత్తి తునిఁగిపడెఁ దుత్తుమురై. ౧౫౦

ఆ. వె. వ్రాల్చియున్నతలను బైకెత్తి రుస్తుము
కన్నులెఱ్ఱఁజేసి కఱచి యౌడు
నీటు నెత్తి "చూడు మిదె! నీకు రుస్తుముఁ
గానఁబఱతు" నంచుఁ గనలి యఱచె. ౧౫౧

౧౦

ఉ. ఆ పలుకాలకించి యడుగాడక మ్రాన్పడి డెందమూఁగఁగాఁ
జూపులనిల్పి పైకుఱుకు శూరునిరూపముఁ బాఱఁజూచుచున్
బాపము! చేతిడాలు మతిమాలి త్యజించెను సొహరాబు; క
ట్టా! పరికించి సందును నిరాయుధు రుస్తుము గ్రుచ్చె రొమ్మునన్.

క. నిలువునఁ గూలిన వృక్షము
వలె నా సొహ్రాబు నేలఁబడి యిట్టట్టుల్
గిలగిలఁ గొట్టుకొనెన్; మి
క్కిలిపొరలును దొరలు నొప్పికినిఁ దాళ కయో! ౧౫౩

క. అంతటఁ దత్ప్రాంతంబున
సంతమసము పాయ విచ్చి చనె మొగిళులతోన్;
శాంతించె వాత్యయును; భా
స్వంతుఁడు వెలయించెఁ గాంతిజాలం బచటన్. ౧౫౪

గీ. కొదమసింగంబు మార్కొని కూల్చియున్న
ముసలి బోయయు వలె వీరపురుషు బాలు
సొహరాబుని వృద్ధరుస్తుము హరించి
ప్రక్క నిలువంగఁ గాంచె నా పౌఁజులెల్ల. ౧౫౫

గీ. అట్టహాసంబుఁగావించి యంత రుస్తు
మిట్టులాడెను 'సాహ్రబ! యెంచినావె?
చిదిమి మగఁటిమి మా ఫారసీకవీరు
బిరుదులు హరించి జేని కర్పింపనేఁడు. ౧౫౬

క. నిను మార్కొన వృద్ధుఁడు వ
చ్చును రుస్తుము; వానిఁగూల్చి శూరతఁ గయ్యం
బునఁ గీర్తిగాంతు ననుచున్
మనమునఁ దలపోసితే! యమానుషవృత్తీ!. ౧౫౭

క. ముదుసలి కావుటఁ జాలఁడు
కదనమునకు నందు జంట కయ్యంబున కం
చెద రుస్తుము నెంచకుమీ!
ముదిమార్రఁకులు చేవ; రుస్తుముకు ముది మున్నే? ౧౫౮

క. ధరణిని గొంతెమకోర్కులు
నెఱవేఱునె? బొజ్జ నిండునే! మనుజుం డూ
పిరిఁబట్టి వట్టిచేతులఁ
బరువడి మూరలను వేయ ఫలమున్నదొకో? ౧౫౯

క. కొలఁదికి మించిన బరువునఁ
దల వ్రియ్యలుగాదె? యా విధంబున నోరీ!
కొలఁదికి మీఱిన వంతం
బుల నీవును బిలుకుమాఱి పోకుండుదువే? ౧౬౦

క. తల్లికిఁ దండ్రికిఁ గాకిటఁ
దెల్లిన నీమేని కండఁ దీఱనికోర్కెన్
గొల్లాడి కుక్కనక్కలు
కుళ్లింగాఁబెట్టి విందుఁగుడుచుచు నుండున్. ౧౬౧

౧౧

మ. అన, సొహ్రాబు వచించెఁ గ్రొంకక "యనార్యా! నీవు నన్ గూల్చితే?
నను నా రుస్తుముగూల్చె నీ రణమునన్; దన్నామమున్ నీవు పే
ర్కొని "చూపింతు"నటన్న భ్రాంతివడి దిక్కుల్ చూచుచున్ వీడ డా
లును హింసించి నిరాయుధుం గడిమిపల్కుల్ పల్కెదే యిమ్మెయిన్?

క. నినుఁబోని వారిఁ బదుగురఁ
దునియలు దునియలుగఁ జేయుదున యొక్క మొగిన్
ననుఁ గవిసి యధర్మమునకు
నిను వలె నొడిగట్టకున్న నిజముగ వినుమీ! ౧౬౩

క. నీ తలఁగాచి యధర్మము
నాతల హరియించె? నీవు నావలె, నే నీ
రీతిగ నుందున, యీ విప
రీతత లేకున్న; నీ యదృష్టము పండెన్. ౧౬౪

క. నా తండిరి రుస్తుము నీ
ఘాతుక కృత్యంబు విన్నఁ గడికండలుగా
నీ తనువును దఱగండే?
ప్రీతిగ నినుఁ జీరి చిత్రవధ సేయండే? ౧౬౫

క. అతఁడిపుడెచ్చట నుండెనో!
సుత మరణం బెఱుఁగఁ డకట! శోధించితి నీ
క్షితిమండలంబు సర్వం
బతనిం గను భాగ్య మబ్బదయ్యెను నాకున్. ౧౬౬

ఆ. వె. అని వచింప రుస్తుమా మాట విశ్వసిం
పక యనాదరించి పలికె ని "ట్ల
పుత్త్రుఁడైన రుస్తుము త్వదీయపిత యంట
వింత లందుఁ బెద్దవింతగాదె?" ౧౬౭

క. విని సొహ్రాబ్ మాటల
ననె రాల్పడ నెలుఁగు "నేన యాతని పుత్రుం
డను; నాజనకుం డాతఁడు;
కన మొక్కరి నొక్క రింతకాలము దాఁక౯. ౧౯౮

క. ఈ వృత్తాంతము పాఱకక
పోవునె? యేనాఁడో రుస్తుమునకు? కాతఁడెర్గ౯
నీ విడ్డ వార్త సైఁచునె?
ప్రావేల్పన అంపకోఁత పట్టఁడె నిన్ను౯? ౧౯౯

గీ. ఆ మదేకపుత్రుఁడైన రుస్తుము నాదు
ఘోరవార్త కెంతఁ గుములఁ గలఁడొ?
క్షితినిఁ దావకైక సుతుఁ డిట్లు గతియింప
నెంత చిచ్చురగులు నెడఁద నీకు? ౨౦౦

ఆ. వె. నన్నుఁగాంచనట్టి నాతండ్రి రుస్తుము
కొఱకు కన్న మిగులఁ బరితపింతు
నన్ను మోసి కాంచి యిన్నాళ్లు పెంచిన
తల్లి దిక్కులేని "తహ్మినా"కు. ౨౦౧

క. చదలంటు మిద్దె నిలఁబడి
చదు రేర్పడఁ గదనమందు జయమొందిన నా
పదినూర్ల బిరుదములఁ గన
నెదురులు సూచెడు మదంబ యిది విని మనునే? ౨౦౨

గీ. పతివియోగంబునకుఁ దోడు సుతవియోగ
మిట్టులు తటస్థపడ గోరుచుట్టు పైని
నకట! రోకంటి పోటట్టు లామె యెట్టు
లుమ్మలిక మోర్చి బ్రదుకునో నమ్మఁజాల. ౨౦౩

గీ. దుహితృ దౌహిత్రులగు మమ్ము నపహరహంబుఁ
గనుచు మాతోడిదే లోక మనుచు నమ్మ
చకట! మంచపుఁ దొడుగఁబడ్డైన తాత
యిట్టి రొమ్ములకుంపటి యెట్టు సైఁచు ? ౧౭౪

క. నాజన్మస్థానంబగు
"ఆజరుబైజాను" దాని యధిపతిఁ దాతన్
నా జననిఁ 'తహ్మినా' సతి
నాజనకుని రుస్తుమునిఁ గనం జాల నిఁకన్. ౧౭౫

క. అని సాహ్రి బహువిధమునఁ
దన తలిదండ్రులను, దాతఁ దనమరణంబున్
మనమునఁ దలఁచుచు భరియిం
పనురాని విషాదమందు మగ్నుం డయ్యెన్! ౧౭౬

౧౭

మ. స్వమనోవేదన సోహరాబిటులు దెల్పన్ స్వాత్మసంబంధి నా
మము లాలించియు 'నాకుఁ బుత్రికయ జన్మంబందెఁ బుత్రుండుగాఁ
డ; మదీయాత్మజుఁ డన్న కీర్తిగొన నీటాటోటు కావించు మో
సము నిట్లాడుచు నంచు రుస్తుమెద విశ్వాసింపఁ డా వాక్యముల్.

మ. తమ పుత్రోదయ వార్త నంపుమని యంతర్వత్నియౌ పత్నికిన్
సమరక్షోణికిఁ బోవుచున్ నొడువ, నాశంకించి యా బాలు రు
స్తుము కొంపోవునో యుద్ధశిక్ష? కని కూఁతుర్వొట్టె నం చన్నె నా
యమ సందేశము; దాన నాతఁ డెఱుగండయ్యెన్ యథార్థ స్థితిన్.

క. "వినుకలిఁ బొరపడితినో?" యని
వెనుకటి యా కబురు తెలియువేళను దూతం
దన గుచ్చి గుచ్చి ప్రశ్నిం
చిన విధము స్మరించి యతఁడు స్థిరమతి నుండెన్. ౧౭౭

గీ. కాని సంబంధి నామముల్ వీనులందు
బ్రతిరవింపంగ సొహ్రాబు వదనమందు
స్వప్రియా ముఖపద్మంబు ప్రతిఫలింప
సూక్ష్మదృష్టినిఁ గాంచి రుస్తుము తలంకె. ౧౮౦

గీ. జల్లుమనుగుండె మెలమెల్ల సర్దుకొనుచు
సత్యమని నమ్మె పుత్రికా జననవార్త;
సంశయించును; గ్రిమ్మెఱ సంబళించు
మర్మవేధను గొను; స్వస్థమానసుఁడగు. ౧౮౧

ఉ. స్వాపహృతాశ్వముం వెదకు "చాజరుబైజను" కేగియుంట, నా
క్ష్మాపతి తన్ను మెచ్చి యెలజవ్వనిఁ గూఁతు నొసంగు, టాపెతోఁ
గాపురముల్, విహారములు, గాదిలి మామయుఁ జూపు నెయ్యముల్
స్వాపకథల్ వలెం దలఁచి పాపము! రుస్తుము వీడె బాష్పముల్. ౧౮౨

ఆ. వె. పుత్రిగాక తనకుఁ బుట్టిన యాబిడ్డ
పుత్రుఁడైనఁ బ్రియమును వహించి
నేఁటి కితనిపోల్కి నెఱజోదు గాఁగల్గు
గాదె? యంచు నూర్చెఁ గడు నెడంద. ౧౮౩

క. గుఱుతింపక తనదూడను
పరిమార్చిన యాలపోతు వడువున నకటా!
పొరిగొంటినొ నాసుతు? నని
మరల న్మొఱడె నతండు స్మరియించి సుతున్. ౧౮౪

ఆ. వె. గడ్డికోఁతవేళఁ గానకకోసిన
తియ్యమావి మొక్క తీరునొంది
సొహ్రాబు మోము సొంపులు వాడంగ
శాద్వలమునఁ బండెఁ జాఁచి కాళ్ళు. ౧౮౫

ద్వంద్వ యుద్ధము

క. చెదరెడు గుండెలు రుస్తుము
కుదుటం బఱచుచుఁ, గడిందిఁ గొందలపడుచున్
మదియందుఁ, దేఁటిచూచుచుఁ,
గదిసియు సొహ్రాబు మెల్లఁగా నిట్లనియెన్. ౧౮౬

చ. పుడమిని నీవు రుస్తుముని పుత్రుఁడ వంటకుఁ దగ్గ లావునుం,
గడిమియు, సాహసంబు, రణకౌశలముం గల; వైన లేఁడు పు
త్రుఁడు; కలదొక్కపుత్రికయె రుస్తుము; కేటికిఁ గల్లమాటలన్
నొడివెద; వీ మృషోక్తుల నినుం జదివించిరి కీర్తికై ఖలుల్. ౧౮౭

క. అనఁగా సొహ్రాబత్తఱిఁ
దనరొమ్మునఁ గాఁడి యధికతరముగ మే నె
ల్లను బెద్ద మంటగొలిపెడి
ఘన కుంతముఁ బెఱికి మృతినిఁ గాంచఁదలంచెన్. ౧౮౮

ఆ. వె. కాని శాత్రవుండు కల్లరి వనియన్న
దూషణోక్తిఁ గినిసి "తొలుత నతని
విశ్వసింపఁజేసి విడుతుఁ బ్రాణము" లంచుఁ
జాలకయును లేచి సగము వలికె. ౧౮౯

౧౩

క. కుమతీ! కల్లరివనినను
విమృశ్యకారిత్వ మెడలఁ బ్రేలితి; విల దూ
రము నాకుఁ గల్ల; యాపయి
ముమూర్షు వెవ్వఁడు మృషోద్యములు భాషించున్? ౧౯౦

క. ఇదె! చూపింతును జూడుము!
మదీయ పిత్రాజ్ఞ నాకు మాతల్లి భుజా
పదమున వేసిన ముద్రను;
నది గనినను నీదు సందియ మ్మడఁగునొకో? ౧౯౧

క. ఆ మాటలువిని రుస్తుము
మోమున నెత్తెఱ్ఱింగ్, బాదములు వడకంగాఁ
జేమొత్తుకొనుచు రొమ్ములు
పాఱిమువగ న్నెలుఁగు రాలఁ బలికెను మెల్లన్. ౧౯-౨

గీ. "ఓయి సొహాబ ! నీది మృషోక్తిగాద,
రుస్తుము సుతుండవౌదువా రుజువుసూపు;"
మన్న వడకంగఁ దనవ్రేళ్ళు లత్తఁడు మెల్లఁ
బాఁచి కవచంబుఁ జూపించె బాహువుదఱి. ౧౯-౩

మ. తనుఁబుట్టంగనె మెంచి కీడును ముహూర్తజ్ఞోప దేశంబునన్
వనమందుం దన తండ్రి వీడఁగ, నటన్ దర్శించియుం దెచ్చి నం
దనుఁగాఁ బెంచిన యొక్క మానిపదముద్రన్ వంశచిహ్నంబుగాఁ
గొనియెన్ రుస్తుముతండ్రి; రుస్తు మది కన్గొఁగల్గె సొహాబుపై. ౧౯-౪

క. తన తల్లి తనకుఁ బోలెను
జిననాఁటను సోహరాబు చేతిపయినిఁ ద
జ్జనని రచించిన కులము
ద్రను గలవరపడుచుఁ గనుచతం డట నిలిచెన్. ౧౯-౫

క. తనచేఁ దాఁకుచు సొహాబ్
"బనితర కులముద్రయిది; యథార్థంబుగ నా
రణమల్లుండగు రుస్తుము
తనయునిదో ? కాదో ? లెస్స తర్కింపు"మనెన్. ౧౯-౬

౧౪

క. నిలిచిన రుస్తుము కనుఁగొల
కుల బాష్పములురలె; నాటె గొంతుక; నోరన్
క్కిళ్ళులువడెఁ; దుదికి నెట్లో
యలజడి వడి "హా! కుమార!" యని బిట్టఱచెన్. ౧౯-౭

## ద్వంద్వ యుద్ధము

క. తల తిరిగెఁ గడుంగడుఁ; గ
న్నులఁ బెంజీఁకటులు గ్రమ్మె; నురుగులు వెడలెన్
సెలవులఁ; జేష్టుడిగిన య
ట్టులు రుస్తుము వ్రాలె భువిఁ బటుత్వం బెడలన్. ౧౯౯

మ. అతి కృచ్ఛ్రంబుగఁ బ్రాఁకిప్రాఁకి చని సోహ్రాబంతఁ గేల్దోయితో
క్షితిపై వ్రాలిన తండ్రి కంఠమును నాశ్లేషించు; స్పర్శించు నా
పితృగండస్థలముల్; తదోష్ఠములు చుంబించుం; బ్రహర్షాశ్రులన్
అతనిన్ స్నాతు నొనర్చు గాఢమగు ప్రేమావేశ మొప్పన్ మదిన్.

గీ. పుత్ర గాత్ర పరిష్వంగమునను జేసి
తేఱి మూర్ఛను గన్నులు దెఱచి చూచి
కడుపుచుమ్మలు చుట్టంగఁ గొడుకుఁగాంచుఁ
దనదు దౌర్భాగ్యదశకు నుత్తప్తుఁ డగుచు. ౨౦౦

క. చుఱచుఱ వాఁతలు వేసిన
కరణిని, మెయిఁ దూఁట్లుతూఁట్లుగాఁ దొలిచిన యా
తెరఁగున, భగభగ మండెడి
కొఱవుల నంటించినట్లుఁ గుందతఁ డొందెన్. ౨౦౧

ఆ. వె. చల్లుకొనును దుమ్ముఁ బెల్లుగా నెత్తిపైఁ;
బెఱికికొనును నెఱులు; బఱికికొనును
మొగముఁ జెవులుఁ జిబుకమును; రొమ్ముల నతండు
బాదుకొనును బిచ్చివాని పగిది. ౨౦౨

క. వికటాకృతితోఁ దండిరి
వికవిక నవ్వుచును గత్తిఁ బెఱకంగ స్వపు
త్రిక ఘాతిఁ దన్నుఁ బొరిగొన
స్వకరంబున నాఁపి సుతుఁడు జనకునిఁ బలికెన్. ౨౦౩

౧౫

క. జనకా! మది శాంతింపుము
వనటంగొను టేల? బ్రహ్మవ్రాఁత చెరుగునే?
మనుజుఁడు నిమిత్త మాత్రుం
డని కద శాస్త్రములు పలుకు నాయాకిరియలన్. ౨౦౪

గీ. నీ మహామూర్తిఁ గాంచిన నిముసమందె
తండ్రివని గోలవెట్టెఁ జిత్తమ్మునాకుఁ
దోఁచియే యుండు నీకుఁ బుత్రుండ నంచుఁ
గాని దుర్విధి మదికి మైకంబుఁ గప్పె. ౨౦౫

క. విధియే శుభములు వ్రాయును;
విధియే శుభములను జెఱుపు; విధియే తిట్టున్
విధియే దీవించును; భువి
విధి బలవత్తరమ యెల్ల వేల్పులకన్నన్. ౨౦౬

క. ఇంతట నీ చర్చను జా
లింతము; నేఁగాంచఁగలనొ? లేనో? యనుచున్
స్వాంతమునఁ బొగిలితిని దే
హాంతమునం దైనఁ గంటినయ్యను నిన్నున్. ౨౦౭

క. రమ్మో! జనకా! నా పా
ర్శ్వమ్మునఁ గూర్చుండుము; మిమ్ము బాహాసంశ్లే
షమ్మును; ముద్దాడుము పే
రెమ్మున నన్నుఁ బిలువుమా! 'కుమారా'! యనుచున్. ౨౦౮

గీ. గంటమ్రోగుచునున్నది; కాలయముని
పిలుపు వినవచ్చుచున్నది వీనులకును;
నన్ను లాలింపుమా! నాయనా! యటంచు
మోముపై మోమునంటించి ముద్దుగొమ్మ! ౨౦౯

ఆ. వె. పిన్ననయ్యుఁ బెద్దవెలుఁగు వెలిఁగితిఁ !
దండ్రిరగులఁ దగ్గ తీండ్రిఁగొంటి;
దండిమగల గుండె లెండించితినిఁ దండ్రి!
ఇంతకన్న వలయునేమి నీకు ? ౨౧౦

మ. నిను దర్శింపఁగఁ బెద్దకాలముగ యత్నింతుంగదర్గ; నీదు ద
ర్శనముంగంటిఁ; బ్రిసన్నతం బడసె నా స్వాంతంబు; నాకోసమై
మనమందీవు విచారమొందకు మకస్మాజ్జాత మత్పుత్రిర్గ;
అనుకొమ్మిద్ది సుషుప్తివృత్తము నగణ్యాంబైన యంశంబుగర్. ౨౧౧

ఆ. వె. అనివచింప నూపిరినిఁగొన్న చందాన
బరువుదీసినట్లుఁ బరగి తండ్రి
కౌఁగిలించుఁ; బుతుర్రిఁగన్నీటి మున్నీట
ముంచు; నేడ్చుఁ; దడవు ముద్దుగొనును. ౨౧౨

క. "పరమేశ్వర! నాచే నిటు
పరిమార్పించితివె నాదు వంశాంకురమర్గ!
బరిమార్పింపకపోతివె
జరఠుండగు నన్ను వీని శాతాసిలర్గ. ౨౧౩

ఆ. వె. అక్కటా! యధర్మ్యమైన యుద్ధమొనర్చి
కన్నకొడుకుఁ జంపుకొన్న పాపి
నధమునన్ను సుభటులార! వైళమవచ్చి
చేయరైతిరేల చిత్రవధను? ౨౧౪

గీ. ఏ నసామాన్యయోద్ధగా కిట్టివిధమున
నుర్వి సామాన్యభటుఁడనై యుండియున్నఁ
దక్కియుండు మదీయ పుత్త్రికుఁ" డటంచుఁ
బుండు వాఁబంగ గుండె వాపోవుచుండె. ౨౧౫

క. శిలలైన నేడ్చు; వజ్రం
బులు వ్రియ్యలు వాఱు; వారి పూర్ణోదంతం
బులువినఁ; గాంచెదు నిరుపౌఁ
జులు నశ్రులు వదలిరన్నఁ జోద్యంబగునే? ౨౧౬

గీ. అత్తఱిం బ్రాంత తరుబద్ధమైన యాత్మ
హయము 'రుక్షా' ఖ్య మచ్చటి కరుగుదెంచి
మూల్గుచును గంటఁ దడిగొంచు మూకభాష
వారి నోదార్చుచుండిన పగిది నిలిచె. ౨౧౭

క. కనఁగొని దానిని రుస్తుము
"ననుఁ గొనిరానేల? యీ రణస్థలికినిఁ గ
ల్గునె యిట్టిబెడఁద నీ కా
ళ్ళను ముళ్ళులు విఱిగియున్న లావఱియున్నన్." ౨౧౮

క. అని దుఃఖంబునఁ దెగడఁగ
విని సొహ్రబశ్వగళముఁ బెనఁగొని "యిదియే
మన రుక్ష తురంగము? మా
జననినోడిచె దీని ధైర్యసాహసశక్తుల్." ౨౧౯

క. అని దానిమెడను జఱచుచు
"ఘనాశ్వమా! నిన్నుఁ గాంచఁగల నెన్నఁడొ! నా
జనకునితో పాటుగ నని
మనమున నువ్విళ్ళుగొంటి మరియు మరియున్." ౨౨౦

క. నినుఁ బెంచి పెద్దఁ జేసెను;
దనయునివలె నీవునుం గృతజ్ఞతఁ దత్సే
వనమున నుంటివి; నా క
న్నను సుకృతివి సోదరుఁడవు నాకు హయంబా! ౨౨౧

## ద్వంద్వ యుద్ధము

క. మన తల్లి నన్ను సాఁకెను;
మన తండ్రి నిన్ను సాఁకె; మన మిరువురముఁ
జిన పెద్ద సోదరుల మె
య్యాన నన్ను స్మరింపుమన్న యరుగుచు నుంటిఁ. ౧౧౧

క. అని తురగము ముద్దిడుకొని
తనయుండు సుదుర్భర వ్యథాపీడితుఁడై
జనకుని పాదసమీపం
బున నటునిటుఁ గొట్టుకొనుచుఁ బొరలె నొకత్రుటిఁ. ౧౧౩

క. సొహరాబు తీవ్రవేదన
సహింప కీటియనుబుచ్చ జనకునిఁ గనుచున్
సహయానం బొనరించెను
బహుముఖముల రక్తఝరులుఁ బ్రాణములుఁగటా! ౧౧౪

ఆ. వె. అతనిఁగాంచి సైఁప కా రుస్తుమఱచుచు
'ఒకసానదీ! త్వదూర్మితతిని
నన్ను మ్రింగుమమ్మ! నన్ను మ్రింగు"మటంచుఁ
బరుగువాఱె దానివైపు వడిని. ౧౧౫

సమాప్తము.

